

ముఖచిత్ర కారుడు

అంబర్తో బొసియోని (1882 - 1916)

బొసియోని అత్యంత ప్రతిభావంతుడైన ఇటలీ కళాకారుడు. ఇతడు భవిష్యవాద ఉద్యమానికి (Futurist movement) చెందినవాడు. ఈ వాదాన్ని గురించి అతడు సాధికారంగా మాట్లాడగలడు. 1882 లో దక్షిణ ఇటలీలో జన్మించాడు. 18వ యేట రోమ్ కదిలి వెళ్ళి వ్యాపార కళాకారుడుగా పని చేశాడు. రోమ్‌లో అగ్రగామి కళాకారులతోడి పరిచయంతో అతనికి ఆధునిక నగరజీవితాన్ని చిత్రించాలనే ఆసక్తి పెరిగింది. పారిశ్రామిక ఇతివృత్తాల చిత్రణను ఆ పరిచయం ఇనుమడింప జేసింది.

1910 వరకు గూడ అతడు కళాకారుడుగా పరిణతి చెందలేదు. 1909 ప్రారంభం ఐరోపానంతా ఒక ఊపు ఊపిన భవిష్యవాద నాయకుడైన మారినెటితో పరిచయమయ్యాకనే అతని కళా కుసుమం విచ్చుకొంది. ఆ తరవాత, బొసియోని కొద్ది కాలమే జీవించాడు. అంటే తన 33వ యేట 1916 లో గుర్రం స్వారిచేస్తూ మరణించాడు. ఈ కొద్దికాలం కళా జీవితం భవిష్యవాదంతోనే ముడివడి ఉంది.

## ముఖచిత్రం గురించి

''దేశంలో అనన్య సాతత్యరూపాలు'' బొసియోని శిల్పాలలో కెల్ల అత్యంత వైభవోపేతమైంది, విజయవంతమైంది ఈ శిల్పమే. దీనిని చూస్తుంటే ''చలనాని''కి సంబంధించిన బలమైన ముద్ర మన మీద పడుతుంది. ఈ శారీరాకృతిలోని సాతత్యం ''జ్వాలా సదృశ అవయవాల దీర్ఘీకరణం'' ద్వారా సాధింపబడింది. కొన్ని శక్తుల ప్రభావానికి లోనై, ఆకృతి చలనం ఆకాశంలో ముందుకు గమిస్తున్నట్లుంది.

# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.

సంపుటి 8 నవంబర్ 1996 సంచిక 10

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



ముఖచిత్రం : **దేశంలో అనన్య సాతత్య రూపాలు**

విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

Printed, Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

సంపాదకుడు : అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

# జన్మదినం

ఒక వ్యక్తి గొప్పదనం అతడు ప్రతిబింబించె భావజాల బల్మంలో ఉంటుంది. అతడు కనే కలలలో ఉంటుంది. అతడు వాటని యథార్థం చేసుకోవడంలో ఉంటుంది.

మిసిమి వ్యవస్థాపక సంపాదకులు డా॥ ఆలపాటి రవీంద్రనాథ్ గారికి అటువంటి భావనా పటిమఉంది. అటువంటి కలలు కన్నారు. వాటిని మిసిమి ద్వారా ఆయన యథార్థీకరణం చేసుకొన్నారు. ఆయన తరవాత, ఆ ఊపిరితోనే, ఆబలంతోనే మిసిమి ముందుకు సాగిపోతోంది.

ఆయన జన్మదినం నవంబరు నాలుగు. జన్మదిన ఆడంబరాలు, వేడుకలు ఆయనకు గిట్టవు. ''ఏముంది జనన ఘటనలో? ప్రతి ఒక్కరూ ఏదో తేదీన, ఏదో ఊరిలో, ఏదో సమయంలో, ఏవరో తల్లిదండ్రులకు పుడతారు. అలా, అదే తల్లిదండ్రులకు, అదే గ్రామంలో, అదే సమయాన అదే తేదీన ఎందుకు పుడ తారో ఇంతవరకు చెప్పిన వారు లేరు. మరి మహాత్ముల జనన వేడుకలు జరుపుకొంటున్నామంటే ఆ తేదీ ముఖ్యమని కాదు, వారు జన జీవితాన్ని ప్రభావితం చేసిన తీరును గుర్తుచేసుకోవడానికి. అందుకని వారి జీవితాల్లో ఏరోజైన ఒకటే. నేను అతి సామాన్యుడిని. జన్మదిన అట్టహాసాలు నాకు గిట్టవు'' అనేవారు ఆయన.

''బుద్ధుడి జననం, జ్ఞానోదయం, నిర్వాణం బుద్ధ పూర్ణిమనాడే సంభవించాయి. ఆగస్టు 15న భారతం స్వతంత్రమైంది. ఆగస్టు 15ననే అరవిందులు పుట్టారు. నాలుగు సంవత్సరాల కొకసారి నవంబరు 4న అమెరికా ఎలెక్షన్లు జరుగుతాయి. మీ జన్మదినమూ **నవంబరు నాలుగే**. అందులో విశేషం ఏమీ లేదంటారా?'' అని ప్రశ్నించినప్పుడు చారిత్ర కతానియతిని నమ్మేవారి సంగతి నాకుతెలియదుకాని, నా మట్టుకు నాకు అందులో విశేషం ఏమీ లేదు'', అన్నారు.

జన్మదిన వేడుక లాంటి అట్టహాసం ఏమీ లేకుండా ఈ సందార్భన్ని పురస్కరించుకొని, నవంబరు మిసిమి ఆయన అముద్రిత రచన, ''ధర్మరాజు విదురుని కొడుకా?'' అనే వ్యాసాన్ని ప్రచురిస్తోంది.

ఆయన భావపరిశీలన చేసి, ఐరావతే కార్వే ఆధారంగా, కుంతి కర్ణాది వ్యాసాలు పాఠకుల అభిమానాన్ని చూరగొన్నాయి. ఆకోవలోదే ఈ వ్యాసమూన్నూ.

ఇది మిసిమి జరిపే ఆయన సరళజన్మదిన వేడుక.

# ధర్మరాజు విదురుని కొడుకా ?

ఆధారం : ఐరావతీకార్వే　　　　　　　　భావపరిశీలన : డా॥ ఆలపాటి రవీంద్రనాథ్

(అముద్రిత రచన)

భీష్మ విదురులు : ఈ ఇద్దరిలో పాండవులను ఎవరు ఎలాచూశారనేదానిని బట్టి మనకు ఒక రహస్యం అవగతమవుతుంది. విదురుడు పాండవులను అన్ని కీలక సమయాలలోను కంటికి రెప్పలా కాపాడాడు. పాండవులకు కీడు జరగబోయే అన్ని సందర్భాలలోను వారిని ముందుగా హెచ్చరించాడు. సహాయం చేశాడు. ఎందుకిలా చేశాడు? భీష్ముడు అందరికీ పెద్ద అయి ఉండిగూడ పాండవులను రక్షించడానికి ఏమీ చేయలేదు. ఎందుకని? అసలు వారసులే లేరనుకొన్న వంశానికి ఇద్దరు వారసులు ఏర్పడి, ఆ ఇద్దరి ద్వారా 105గురువారసులు ఏర్పడ్డారు. ఇంతమంది వారసులున్నప్పుడు, కురువంశం సింహాసనం మీద ఉన్నంతకాలం, కొంతమంది పోతే మాత్రం ఏమిటిలే అనుకొన్నాడా? అసలు జ్ఞాతుల మధ్యవైరం ఆయనకు తెలియదా? ఏది ఏమైనా ద్రౌపది స్వయవరం వరకూ పాండవుల మీద కౌరవుల కున్న వైరదృష్టి ఆయనకు తెలియదు.

కాని విదురుడు పాండవుల యెడ తండ్రి లాగ ప్రవర్తించాడు. అలా ప్రవర్తించేటప్పుడు అతడు చాల జాగ్రతగా వ్యవహరించ వలసి వచ్చింది. అతడి స్థానం దిగువ స్థాయిది. అందుకని మరీ జాగ్రత్తగా ఉండవలసి వచ్చింది. ధృతరాష్ట్రుని జిత్తులు, ధుర్యోధనుని అసూయ, పాండవులను మట్టుబెట్టాలనే అవకాశాల కోసం ఎదురుచూసే శకుని ధుర్యోధనుల ప్రయత్నాలు, అందరికీ తెలిసిపోయాయి. వీరి కుట్రలన్నింటిని ముందుగా పాండవులకు ఎరుకపరిచినవాడు యుయుత్సు. ఇతడు ధృతరాష్ట్రుని ఉంపుడు కత్తె కొడుకు. అయినాపాండవులు ఎప్పుడూ విదురుని సలహానే పాటించారు. విదురునికి పాండవుల మీదేకాక, కుంతి యెడ కూడా ప్రత్యేక అభిమానం అపేక్ష ఉన్నాయి. కుంతి అక్రమ సంతానమైన కర్ణుడు, అర్జునుల మధ్య పోరుతప్పని పరిస్థితి ఏర్పడి కుంతి మూర్ఛపోతున్నప్పుడు విదురుడు దానిని నివారించిన తీరులో మనకు ఇది కనిపిస్తుంది. విదురుడు ఆమెను ఓదార్చి, పోరును అతినిపుణతతో తప్పించాడు. పదమూడేళ్ళ ప్రవాసంలో కుంతికి ఆశ్రయ మిచ్చింది విదురుడు. విదురుడు పాండవ పక్షపాతి అని ధుర్యోధనుడు పాండవులను చంపడానికి సుదూరనగరానికి పంపడానికి కుట్రపన్నుతున్న సందర్భంలో ఎవరెవరు ఏ పక్షమో చెప్పాడు. ''భీష్ముడు పూర్తిగా తటస్థుడు. ద్రోణుని పుత్రుడు మావైపున ఉన్నాడు. పుత్రుని అనుసరించే తండ్రీనూ, కృపుడు వీరిద్దరిని అనుసరిస్తాడు. విదురుడు పైకి కనిపించడు కాని వాస్తవానికి అతడు పాండవుల వైపే. ఏది ఏమైనా అతడికై అతడు చేయగలిగింది అట్టే ఏమీ లేదు.''

జిత్తుల మారి ధృతరాష్ట్రుడు పాండవులను చంపించడానికి వారణావతానికి పంపే ఏర్పాట్లు చేశాడు. తమకు మృతువు తథ్యమని తెలిసినా, ధర్మజుడు అప్రణాళికకు అంగీకారం తెలపక తప్పలేదు. ఆ సందర్భంలో విదురుడు ద్వంద్వార్థాలతో మాట్లాడి పాండవులకు ఎదురుకాబోయే అపాయాలను అర్థమయ్యేట్టు చేశాడు. అ తరవాత అతడే లాక్షా గృహానికి సొరంగాన్ని త్రవ్వించాడు. అతని దూరదృష్టి వారిని రక్షించింది.

ద్రౌపది తోడి పాండవుల వివాహం తరవాత, విదురుడు పాండవుల కోపు బహిరంగంగానే కాశాడు. ఇప్పుడు పాండవులకు యాదవుల, ద్రుపదుల తోడు లభించింది కనుక, వారు స్వంతంత్రులైనారు కనుక, దుర్యోధనాదులు పన్నే కుట్రలను వమ్ము చేయాలిసిన అవసరం విదురునికి లేకపోయింది. పాండవులు ద్రౌపదిని గెలుచుకొని ఇంటికి తిరిగివచ్చారు. దుర్యోధనుడు అతని మిత్రులు మొహాలు వేల్లాడ వేసుకొని తిరిగి వచ్చారు. ఈవార్తలు విన్న విదురుడు ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళి, ''కౌరవులకు శుభాభినందనలు'' అని అన్నాడు. పాండవులు వారణావతంలో దహనమై పోయారని భావిస్తున్న ధృతరాష్ట్రుడు, నిజంగానే తన కొడుకు ద్రౌపదినిగెలుచుకొన్నాడని భావించి, మిక్కిలి సంతోషంతో, ''బాగు బాగు, ద్రౌపదిని లోపలికి తోడుకురా దుర్యోధనా! వెళ్ళు, వెళ్ళి నగనట్ర పట్టుకురా, ద్రౌపదిని అలంకరించు,'' అని అన్నాడు. అప్పుడు విదురుడు అసలు విషయం చెప్పాడు. ఇక్కడ విదురుడు ద్వంద్వార్థంతోనే ''కౌరవులకు శుభాభినందనలు'' అన్నాడు. కౌరవులంటే కురువంశంవారు. పాండవులుగూడ కురువంశం వారే కదా. ఆ విధంగా సమర్థించు కోవచ్చని విదురుడు ''కౌరవులకు శుభాభినందనలు,'' అని తన కసితీర్చుకున్నాడు. ధృతరాష్ట్రుడు అంతకంటె తెలివిగా, ''నా సహోదరుని సుతులు నా సుతులు కారా, విదురా? వారూ నాకు ప్రియులే,''. అన్నాడు. ''మీ మంచి మనసుకు మీ నోట ఇంత చక్కెరగుక్క, మీ సహృదయం ఎప్పటికీ ఇలాగే ఉండిపోవుగాక!'' అని విదురుడు సంతోషంతో వెళ్ళిపోయాడు. ఆతరవాత దుర్యోధనాదులు ధృతరాష్ట్రుని వద్దకు వచ్చి యధాతథంగా మళ్ళీ పాత ధోరణిలో కుట్ర పన్నడం మొదలు పెట్టారు. కాని ధృతరాష్ట్రుడు కుట్రలు ఫలించవని గుర్తించాడు. భీష్మ, ద్రోణ విదురులను రావించాడు. వారంతా పాండవులతో సఖ్యమే మంచిదని సలహా ఇచ్చారు. ఈ సందర్భంలో విదురుడు చాల ఉద్విగ్నతతో మాట్లాడాడు. ఆ తరవాత విదురుడే స్వయంగా వెళ్ళి కుంతి, ద్రౌపది, పాండవులను హస్తినాపురానికి తోడి తెచ్చాడు. వారి రాజ్యభాగం వారికి ఇవ్వడం జరిగింది. ఈ సంఘటన తరవాత విదురుడు బాహాటంగానే పాండవులను సమర్థించాడు. పాండవులను విదురుడు ఎందుకు సమర్థించి నట్లు? తాను సూతుడు. కురువంశం రక్తం పంచుకు పుట్టినా. దాసీపుత్రుడు కావడంతో, రాజ్యార్హత కోల్పోయాడు. సూతులలో రాచరక్తం ప్రవహిస్తున్నా, వారు గొప్ప రథచోదకులైనా, రాజుల వంశవృక్షాలను వారిగాథలను గానం చేశేవారైనా రాచ నగరులలోనే నివాసమున్నా వారికి రాజ్యార్హత లేదు. రాజవంశంలో పిల్లలను వీరికి ఇవ్వరు. అయితే సూత స్త్రీలను రాజులు చేసుకొంటారు. దుర్యోధనుడు కర్ణుని అంగరాజుని చేసినా, స్నేహితుడని ఒప్పుకొన్నా, ఈతనికి రాచకన్నెను కట్టబెట్టలేదు. ఏది ఎలాగున్నా సూతుల స్థాయి ఒకింత తక్కువే. ఇది విదురునిలో న్యూనతా భావాన్ని రేకెత్తించి మానసికంగా కుపితుని చేసి, పాండవ పక్షపాతిని చేసిందా? ''తనకు ఎలాగూ రాజ్యార్హతలేదు. రాజ్యార్హత ఉండి కూడ దానిని పాండవులు కోల్పోవలసిందేనా?'' అన్న ప్రశ్న విదురుని వేధించింది.

అసలు విదురశబ్దానికి అర్థం ''బాగా తెలిసిన'' అని. జ్ఞాని అని. జ్ఞానం అంటే లోక జ్ఞానం కాదు. పారమార్థిక విలువల గురించిన జ్ఞానం. ఆత్మశాశ్వతమని, పేరాస దుఃఖం చేటని ధర్మాన్ని ఆశ్రయించాలని విదురుడు ఎప్పుడు ధృతరాష్ట్రునికి చెబుతూనే ఉంటాడు. అయినా ఈ బోధ

అంతా చెవిటివాని ముందు శంఖం ఊదినట్లు అయింది. రాజ్యార్హతను కోల్పోయిన ధృతరాష్ట్రుడు, తనకు దక్కనిది తనపుత్రులకైనా దక్కాలనే వాంఛాతప్తుడై మంచి చెడు విచక్షణ జ్ఞానాన్ని కోల్పోయాడు. విదురుని సలహాలను పెడచెవిని బెట్టాడు. అంతా అయి పోయాక గుర్తించాడు. చేతులు కాలాక ఆకులు పట్టుకున్నాడు, ఏ వేవో మిషలు చెప్పాడు. '' నా కొడుకులు ఎదిగి నా అంతటి వారయ్యారు, వారిని నేను మందలించలేను. వారు నా మాట వినరు. నా మాట విననంతటి పెద్దవారయ్యారు,'' అంటూ వా పోయేవాడు. ఒకసారి, ద్రౌపది స్వయంవరానంతరం, ద్రౌపదిని తోడి తెచ్చినప్పుడు, విదురుడు ఎదురు దెబ్బ తీశాడు. ఆ తరవాత చివరకు, ధృతరాష్ట్ర సంతతి అంతరించిన తరవాత విదురుడు మెత్తగా చీవాట్లు వేశాడు. ''హేరాజా! ఇప్పుడు వగచి ప్రయోజనం ఏమిటి? పాండవులు పాచికలాటలో ఓడినప్పుడు, వారిని చూసి నీవు సంతోషంతో గంతులు వేసిన ప్పుడే 'ఇది సంబరపడే సందర్భం కాదని, నాశనానికి నాంది,' అని మిమ్ము హెచ్చరించాను; మీరు నామాట చెవిని దూరనీయ లేదు. క్షత్రియోచితంగా ప్రవర్తించు. ఏడవకు'' అనిచెప్పాడు. ఇందులో విదురుడు అతిశయంతో చెప్పింది ఏమీ లేదు. ఎవరి చేతలకు వారు బాధ్యత వహించాలని, కర్మఫలాన్ని ధైర్యంతో స్వీకరించాలని మాత్రమే చెప్పాడు.

విదురుడు ఎప్పుడు తన దుఃఖాలను ఏకరువు పెట్టుకోవడంగాని, నష్టాలకు వాపోవడం గాని మనం చూడం. అతడు చాల హాయిగా తన స్వగృహంలో, భార్యాపిల్లలతో, పూజా పునస్కారాలతో, పర్యాలోచనతో, ధ్యానంతో జీవించాడు. అయినా ఏ మూలో అనిర్వచనీయ దుఃఖావేశం అతని జీవితాన్ని పట్టి పీడించినట్లు కనిపిస్తుంది.

భారతంలో ప్రతి ఒక్కరు ఆడ-మగ, పెద్ద-చిన్న, ధృతరాష్ట్రుడు, పాండు, గాంధారి, కుంతి, ధుర్యోధనుడు, పాండవులు, ద్రౌపది-సుభద్ర, ఉత్తర - ఉత్తరుడు, ద్రుపదుడు-అతని సంతతి, కృష్ణుడు-యాదవులు - అందరూ ఎత్తు పల్లాలను చూసిన వారే. ఉద్విగ్నజీవితాలను గడిపిన వారే ,రాగద్వేషాలను చవిచూసిన వారే. వారికి నిజమైన శాంతి అంటూ ఎప్పుడైనా లభించిందీ అంటే అది వారంతా చనిపోయిన తరవాతే. వృద్ధాప్యంలో, జీవిత వాస్తవాలలో తాడితులై, అంతిమంగా సన్యాసం స్వీకరించి, ఎంతో ప్రయత్నం మీదటగాని వారికి శాంతి లభించలేదు. అది శాంతి కాదు. శాంతిలా కనిపించే విశ్రాంతి.

ఒక విధంగా చూస్తే మొదట నుంచీ గూడ ప్రశాంత జీవితాన్ని అనుభవించింది విదురుడే నేమో. బహుశ జీవితారంభంలోనే తన జన్మ తనను రాజ్యార్హతకు దూరం చేసిన బాధను దిగమ్రింగుకొని, దానిని అధిగమించి, భావిమార్గాన్ని ఎన్నుకొని పయనించడం వల్ల అలా ప్రశాంత చిత్తుడయ్యాడు! మహాభారతం అందలి అన్ని పాత్రల అంతరంగ మధనాలను బయట పెట్టింది గాని విదురుని విషయంలో మౌనం వహించింది. దీనికి కారణం అతని నామంలో ఉన్నట్లు అతడు ముని కావడాన లేదా యముని అవతారం కావడాన జీవితం ఒడిదుడుకులు అతనిని తాక లేదా ? పోనీ అతడు దేనినీ పట్టించకో లేదంటామా? వుహూం అతడు క్రౌర్యాన్ని. అన్యాయాన్ని ఎదిరించాడు. పాండవుల తరఫున వాదించాడు, అయినా తన అంతస్తును, విధిని మరచి పోలేదు.

మహాభారతం వర్ణించిన ఆటుపోటు కార్యకలాపాలకు విదురుడు, అతని కుటుంబం దూరంగా ఉన్నట్లు కనిపిస్తుంది కాని ఈ ఆటుపోటు కార్యకలాపాల వెనుక గుప్తంగా విదురుని ప్రమేయం ఉన్నట్లు ఎందుకో ఎవరికైనా అనుమానం కలుగుతుంది. పైకి అంతప్రశాంతంగా కనిపించే అతని జీవితంలో ఏదైన రహస్యం మరుగున పడిందా?

విదురుడు పాండవ పక్షపాతే అయినా, అతడు పాండవులందరిలోకి ధర్మరాజుకి మరింత దగ్గరివాడు. వారణావతానికి వెళ్ళేటప్పుడు, అతడు ధర్మరాజును మాత్రమే చేరబిలచి రానున్న అపాయాన్ని హెచ్చరించాడు. కౌరవుల ఆ స్థానం నుంచి ఎప్పుడు వచ్చినా, అతడు ధర్మరాజు తోనే ఎక్కువసేపు మాట్లాడేవాడు. ధర్మరాజు విదురుల మధ్యస్నేహం కృష్ణార్జునుల, దుర్యోధన కర్ణుల స్నేహంలాంటిది కాదు. ఆ స్నేహం జగద్విఖ్యాతం. వీరిద్దరి స్నేహం సముల మధ్యది కాదు. విదురుడు పాండవులకు తండ్రిలాంటివాడు. అంతకంటేవారి మధ్య బంధం ప్రత్యేకమైంది. అసలు వారిద్దరి మధ్య అసాధారణమైన సాదృశ్యం ఉంది. విదురునికి ధర్మం, శీలాల గురించి ఎంత తెలుసో, ధర్మరాజుకీ అంత తెలుసు. యక్షప్రశ్నలకు ధర్మరాజు సమాధానం చెప్పినప్పుడే ఆయన జ్ఞానం మనకు తెలుస్తుంది.

పాండురాజు అనంతరం రాజ్యానికి ఉత్తరాధికారి ధర్మజుడే అయినా, ఆబాట అంతాముళ్ళతో నిండి ఉంది. చిన్నప్పుడు అతడు నిస్సహాయుడుగా శత్రువుల ఇంట పెరగవలసి వచ్చింది. అయినా అతడెప్పుడు తాను రాజ్యానికి వారసుడననే మాట మరువలేదు. తల్లి, సోదరులు మరువనీయ లేదు. యజ్ఞాలు చేయించడం, బ్రాహ్మణులకు దానధర్మాలు చేయడం, పూర్వీకుల కథలు వినడం, అప్పుడప్పుడు పాచికలాడడంతో కాలక్షేపం చేశాడు. కాని అతడు నిర్వహించవలసిన పాత్ర ఒక వీరుని పాత్ర. కాని అతడీ పాత్రను ఎప్పుడు నిర్వహించ లేదు. నీరసపాత్రనే నిర్వహించాడు అతనికి ఏది లభించినా అది ఇతరుల వల్లనే లభించింది. అందమైన భార్య, శక్తి మంతుడైన మామ అర్జునుని వల్ల లభించారు. ప్రవాస జీవితంలో రక్షణ అంతా భీముని వల్ల లభించింది. ఇంద్రప్రస్థాన్ని, మయసభను కృష్ణార్జునులు సాధించి పెట్టారు. యుద్ధంలో గెలుపు సోదరుల వల్ల కృష్ణుని రాజనీతి వల్ల వచ్చింది తానుగా సాధించింది ఏమీ లేదు. మొదటి నుంచి చివరివరకు ధర్మరాజు జీవితం దుఃఖభాజనమే? ఈ అంశంలో ఇది విదురుని జీవితాన్ని పోలి ఉంది. తనకు న్యాయ విహితంగా రావలసినదాని కోసం ఎంతో మూల్యాన్ని చెల్లించవలసి రావడం ధర్మరాజు వంతు అయితే, తన మేధా సంపత్తికి దక్కవలసింది దక్కక పోవడం విదురుని పాలైంది. విదురుడు ఎక్కడ తన బాధను చెప్పుకోడు. కాని ధర్మరాజు బయట పడతాడు. తమ అంతిమ యాత్రలో, ద్రౌపది క్రింద పడి పోయినప్పుడు, ఆమెను చూసి, ''ఆమె పడి పోవడానికి కారణం ఆమె అర్జునుణ్ణి అందిరిలోకి అధికంగా ప్రేమించడమే,'' నంటాడు. ఈ మాటల్లో అతడు జీవితాంతం దాచుకొన్న గాయాన్ని బడబాగ్నిని బయట పెట్టాడు. మరొక మారు గూడ, పాచికలాటలో ఇతరులు ఆర్జించి పెట్టిన రాజ్యాన్ని, భార్యను, పందెం ఒడ్డి గాలికి వదిలి వేయడం ద్వారా తన బాధను వెడల గ్రక్కాడు. అది మగపటిమ గల వాడు చేయవలసిన పనికాదు. తనకున్న రాజ్యం, భార్య ఆస్తి పాస్తులు - అన్నింటి యెడ తనకున్నది అసహ్యం తప్ప మరేమి కాదని, అలాగాలికి వదిలి వేయడం ద్వారా, సంకేతించాడా?

వీటన్నింటిని ఒక చోట చేర్చి చూస్తే విదురుడు ధర్మరాజు తండ్రీ తనయులా అనే సందేహం కలుగక మానదు. ఈ అనుమానాన్ని బల పరచడానికి మహాభారతంలో కావలిసినంత సాక్ష్యం ఉంది. మహా భారతం ఎప్పుడూ ఎవరి రహస్యాన్ని దాచలేదు. కర్ణుడు, కుంతి అక్రమ సంతానమని బాహాటంగానే చెప్పింది. ధర్మరాజు కుంతికి విదురునికి పుట్టినట్లయితే ఆ విషయం ఎందుకు మహాభారతం దాచింది? కుంతి కొడుకులంతా దేవతల ద్వారా పాండురాజు అభ్యర్థన మేరకు కలిగారు. పాండురాజు జీవించి ఉండగానే వారంతా కలిగారు. వారిని తన సంతానం గానే ముద్రవేశాడు. నాటి బీజక్షేత్ర న్యాయం ప్రకారం వారు పాండురాజు కొడుకులుగా ముద్రించబడి, పాండవులు గా చలామణి అయ్యారు. విదురునికి ధర్మరాజు పుట్టాడని తెలిస్తే, అతనిని హీనంగా చూడడం జరిగేదా ? రాజ్యార్హత కోల్పోయేవాడా? ధర్మరాజుకు రాజ్యార్హత లభించాలంటే రెండు అర్హతలుండాలి : ఒకటి అతడు దుర్యోధనుని కంటె పెద్దవాడై ఉండాలి. రెండు తల్లి తండ్రి క్షత్రియులే అయి ఉండాలి. ధుర్యోధనుడు ధృతరాష్ట్రునికి రాకుమారి అయిన గాంధారికి పుట్టాడు మరి విదురుడు సూతుడు కదా! విషయం పొక్కితే ధర్మరాజు అనర్హుడవుతాడు.

సంతానం కోసం కుంతి దేవతలను ఆవాహం చేసినప్పుడు ఆమె మొదటగా యముణ్ణి పిలవడం యాదృచ్ఛికం కాదు. విదురుడు యముని అవతారమే, కనుక ఆమె పిలిచింది యముణ్ణి కాదు; తన భర్త సోదరుడు విదురుడినని భావించవచ్చు. నాటి న్యాయం ప్రకారం పాండురాజు భార్య కుంతి అతని తమ్ముడైన విదురుని ద్వారా సంతానాన్ని బడయడంతో తప్పులేదు. ఆరోజుల్లో దత్తతకంటె ''నియోగం'' అమలులో ఉండేది. వారసులు లేనప్పుడు పరపురుషుని ద్వారా కొడుకును కనడం ఆచారం. దీనినే నియోగం అంటారు. ఈ సంయోగం నుంచి జన్మించిన బిడ్డ యమధర్మరాజు అవతారమైన యుధిష్టిరుడే. చిన్నప్పుడు అతడు ప్రదర్శించిన స్వభావాన్ని బట్టి అతనిని ధర్మరాజు అన్నారు. ఈ విధంగా అనేక కారణాల వల్ల అతడు విదురుని పుత్రుడే.

అతడు విదుర పుత్రుడనడానికి మరో రెండు సంఘటనలు సాక్ష్యం పలుకుతాయి. ధృతరాష్ట్రుడు - గాంధారి, కుంతీ - విదురులు వాన ప్రస్థానానికి వెళ్ళిన తరవాత పాండవులు వారిని అప్పుడప్పుడు చూసి వస్తుండేవారు. అలా ఒక సారి వెళ్ళినప్పుడు ధర్మరాజుకు విదురుడు కనిపించలేదు. ''విదురుడేడి ?'' అని ప్రశ్నించినప్పుడు ''అతడు తపస్సు చేస్తున్నాడు, అన్న పానాదులు విసర్జించాడు,'' అని ధృతరాష్ట్రుడుచెప్పాడు. ఇంతలో ఎవరో వచ్చి, ''విదురుడు దుస్తులను గూడ విసర్జించాడు. పూర్తిగా ధూళి ధూసరంతో నిండి ఉన్నాడు,'' అని చెప్పాడు. అప్పుడు ధర్మరాజు విదురుని వెనుక పరుగెత్తుతూ, ''విదురా ! ఆగు నేను యుధిష్ఠిరుడను,'' అని అన్నాడు. అప్పుడు విదురుడు తన అనిమేష దృష్టిని ధర్మరాజుపై నిలిపి, తన యోగశక్తితో అతని శరీరంలోని ప్రతి అవయవంలోకి ప్రవేశించాడు. విదురుడు ధర్మరాజుకి తనమొత్తాన్ని-తన జీవితాన్ని, శక్తిని, అవయవాలను, మేధను - ఇచ్చివేశాడు. మరణసమయంలో ఇటువంటి ప్రవర్తన ఒక తండ్రి తన పుత్రుని యెడ ప్రవర్తించవలసిన విధంగానే ఉంది. ఉపనిషత్తుల కిది అనుగుణంగానే ఉంది. మరణ మాసన్నమైన వ్యక్తి చేయవలసింది ఉపనిషత్తులలో వర్ణించబడింది. ''అతడు కటిక నేల మీద పరుండి, అతని పై తన పుత్రుని పడుకో పెట్టుకొని, 'పుత్రా! నా

అవయవాలను నీకిస్తాను', అని చెప్పాలి,'' అప్పుడు కొడుకు. ''నేను అంగీకరిస్తున్నాను'' అని సమాధానం చెప్పాలి. ఈ విధంగా మరణిస్తున్నవ్యక్తి తన శక్తిని, సంపదను, ప్రజ్ఞను తన పుత్రునికి దత్తం చేస్తాడు. విదురుడు యుధిష్ఠిరుల మధ్య జరిగిన ఈ చివరి సమాగమం ఇదే రకమైన బదిలీని సూచిస్తుంది. తండ్రి పుత్రులు కాకపోతే ఇలాంటి బదిలీ సంభవం కాదు.

ఆ తరవాత, రెండు ప్రకరణాల అనంతరం వ్యాసుడు ధృతరాష్ట్రునితో చెప్పాడు: ''విదురుడు యముని అవతారం. నాకు విచిత్ర వీర్యుని సేవికకు నా యోగశక్తుల ద్వారా అతడు జన్మించాడు. అతడు తిరిగి అతని యోగశక్తుల ద్వారా యుధిష్ఠిరునికి జన్మనిచ్చాడు. అతడే కురురాజు. ఎవరు ధర్మమో అతడు విదురుడు. ఎవరు విదురుడో అతడు పాండవుడు. ఓ ధృతరాష్ట్ర! నీ అనుంగు సోదరుడు నిన్ను ఎలా సేవించాడో, యుధిష్ఠరుడు నిన్నలాగే సేవిస్తాడు''. ఈ విధంగా కుంతి తన మరిది ద్వారా కొడుకును కన్న విషయం యుద్ధం అయి పోయే దాక రహస్యంగా ఉంచబడింది. చివరకు ఆ విషయం బహిర్గతం చేసే సమయానికి అది అస్పష్ట రూపం తీసుకొంది. అంటే అసలు విదురుడు ధర్మరాజు తండ్రీ తనయులా? లేక ఇద్దరూ యముని వరాన బుట్టారా? - అనే విషయం సందిగ్ధంగానే మిగిలి పోయింది.

విదురుడు ధర్మరాజుకు తండ్రి అయితే, మిగతా కుంతీ పుత్రులకు అతడు తండ్రి ఎందుకు కాలేదు? అనే సందేహం కలగవచ్చు. సోదరుని పేరుతో ఒక వ్యక్తి కొడుకును కనవలసిన అవశ్యకత ఏర్పడినప్పుడు సోదరుని భార్యతో అతడు ఒకసారి మాత్రమే కలవచ్చునని శాస్త్రాలు చెబుతున్నాయి. ఆనాటి న్యాయం అలా ఉంది కనుక విదురుడు మరోసారి కుంతిని చేరలేదు. అందరి సంబంధాలకు సంబంధించి అంత బాహాటంగా వర్ణించిన భారతం, వీరిద్దరి సంబంధాన్ని గురించి గని, ధర్మజుని పై విదురుని వాత్సల్యాన్ని గురించి గాని ఒక్క వాక్యాన్ని గూడ అసందిగ్ధంగా చెప్పలేదు.

విదురుని, ధర్మరాజుని తండ్రీ తనయులుగా మనం అంగీకరిస్తే మహాభారతం మరో కోణం నుంచి దర్శన మిస్తుంది. ధర్మ రాజు విదురుని అక్రమ సంతానమై, పాండురాజుకి చట్టబద్ధ పుత్రుడైతే భారత యుద్ధం పాండురాజు ధృతరాష్ట్రు పుత్రుల మధ్యకాక, ముగ్గురు సోదరుల సంతానం మధ్య జరిగినట్లువుతుంది. ధర్మరాజు పాండు-విదురుల ఉమ్మడిసంతానం. తన బిడ్డలకు తండ్రు లెవరు అనే విషయాన్ని గోప్యంగా ఉంచడానికే పాండురాజు దూరంగా హిమాలయాలలో కాలం గడిపాడు. అందుకనే అతని కొడుకులకు నిజమైన తండ్రులు అజ్ఞాతంగా ఉండిపోయారు. తనపుత్రుడు రాజైన తరవాత గూడ విదురుడు విరాగిగా, నిష్కాముడుగా, మిగిలి పోయాడు. ధర్మరాజుకు న్యాయ బద్ధంగా రావలసినదంతా వచ్చినా, దాని కతడెంతో మూల్యం చెల్లించాడు. ఆ మూల్యం ఏమిటంటే అతడు చివరి కంటూ అసంతృప్తుడుగా, నిర్లిప్తుడుగా మిగిలిపోయాడు. సంతోషించింది లేదు.

* * *

# డాక్టర్లు

- పురాణం సుబ్రహ్మణ్య శర్మ

ఇదివరకు అనగా చాలా కాలం క్రితం, ఎవరికేనా ఏదన్నా అనారోగ్యం సంభవిస్తే, చిన్న, చిన్నవాటికి, బుర్రుబుర్రుమంటూ డాక్టర్ల దగ్గరికి పరిగెత్తేవారుకాదు. అసలు డాక్టర్లనేవారు చాలా అరుదు. అంతకు పూర్వం 'డ్రెస్సర్సు' అని వుండేవారు. వారు అన్ని రకాల వైద్యాలు ధైర్యంగా చేసేవారు.

ఎవరింటికైనా డాక్టరు రావడం అనేది ఒక పెద్ద సంఘటన. అప్పుడు కార్లు లేవు, జట్కా బండిలో డా॰ ఒక కంపవుండరుని తీసుకుని యిళ్ళకు వెళ్ళి చూసివచ్చి మందులు పంపేవారు. డాక్టరుగారొచ్చి సూదిమందు గ్రుచ్చి వెళ్ళారని వింతగా చెప్పుగునేవారు. కలకత్తాలో మెడికల్‌కాలేజి వుండేదని చెప్పుగునేవారు. శవాల్ని ముట్టుకోవాలి, కోయాలి, అని హిందువులెవరూ మెడికల్‌కాలేజీలో చేరేవారుకాదు. అందుచేత తొలి డాక్టర్లంతా క్రైస్తవులు, హిందువులు కాదు. క్రైస్తవుల చేత వైద్యం చేయించుగుంటే మతం, మడి, ఆచారం మంట గలిసిపోతాయని సనాతన హిందువులు వైద్యవిద్యకు వృత్తికి దూరంగా వుంటూ వచ్చారు. పురుళ్ళు పోయడానికి మంత్రసాని, నాటువైద్యులు వుండేవారు. ఆయుర్వేదవైద్యం చేయించుగునేవారు. తెలుగు వైద్యం అని అనేవారు దీన్నే. కల్వాలు నూరడం, లేహ్యాలు, కషాయాలు, మాత్రలు యిచ్చేవారు. పుటంవెయ్యడం అనివుండేది. ఆయుర్వేద రత్నాలూ భిషగ్ రత్నాలు వుండేవారు. మరొక చెంప యునానీవైద్యం నడుస్తూ వుండేది. కేరళవైద్యం అనికూడావుండేది. అసలు చాలా కొంపల్లో అమ్మమ్మలే చిటకా వైద్యాలు చేసేవారు. దెబ్బలూ అవీ తగుల్చుకొని కాళ్ళు చేతులు విరిగితే కట్లుకట్టేవారు. పోడూరు రాజులు కట్లు కట్టేవారు. దేశీయులకు ఇంగ్లీషువైద్యం మీద గురికుదరలేదు. తరవాత ఎప్పుడో హోమియోపతీవైద్యం అనగా లక్షణాలను బట్టి చికిత్స అనేది వాడుకలోకి వచ్చి పేదవారికి ఉపయోగపడింది. డాక్టర్లకి ఫీజులివ్వడం మనవారికి అలవాటు లేదు. మనీసర్క్యులేషన్ జాస్తి వుండేది కాదు. అందుచేత డాక్టర్లు ఏడాదిపొడుగుతా వైద్యం చేసి సంవత్సరంలో ఒకటి రెండుసార్లు సత్యనారాయణ వ్రతాలు చేసినపుడు వూరువూరంతా బహుమానాలు, చదివింపులు సాగించేవారు. ఆవిధంగా డబ్బు, వస్తువులు, కూరలు, పళ్ళు, సమస్తం వూరికేవచ్చేవి. ఆరోజుల్లో వస్తుమార్పిడి (బార్టర్) పద్ధతి వుండేది. రోగుల వద్దకు డాక్టర్లు వెళ్ళేవారు. శస్త్రచికిత్స అనేది ఆరోజులలో ఎరగరు. పూర్వం మంగళ్ళు కూడా వైద్యాలు చిన్నచిన్న శస్త్రచికిత్సలు చేసేవారు. రాచపుండు, క్షయ, సన్నిపాతజ్వరం, పక్షవాతం, మూర్ఛ, బాలారిష్టాలు, బాలెంత జబ్బులు అని వుండేవి. చాలా స్త్రీలవ్యాధులకు సరైన చికిత్సలు వుండేవికావు. ఆయుర్దాయం వుంటే బతికేవారు. పోతే ఆయుష్షు మూడింది అనుకునేవారు. డాక్టర్లు ప్రాణదాతలు అనికూడా అనుకునేవారు. వైద్యులు అంటే తెలుగు వైద్యులని, డాక్టర్లుఅంటే ఇంగ్లీషు వైద్యం చేసేవారని వాడుక. పూర్వం జట్కా బండి మీద వస్తే రూపాయో ముప్పావలానో జట్కా ఖర్చుక్రిందయిచ్చేవారు. డాక్టరుకి యింటికి

వచ్చినందుకు రెండురూపాయలు. మామూలు ఫీజు, అయిదు రూపాయిలలోపు వుండేది. డాక్టరు యింటికి రాగానే కుంపటి వెలిగించి నీళ్ళు కాచేవారు ఇంజక్షన్ సూది సిరంజి మరగపెట్టడానికి. ఇంజక్షను యిస్తూండగా కొందరు కొంగుచాటు చేసుకుని కళ్ళ నీళ్ళు పెట్టుకునేవారు. పేషంటు చెయ్యి (నాడి) చూడటం, నాలిక, కళ్ళు పరీక్షచెయ్యడం తరవాత ధర్మామీటరు పెట్టి జ్వరమానం తీసుకోవడం జరిగేది. డాక్టరు గారికి వెండిగ్లాసులో కాఫీ యిచ్చేవారు. ఈడాక్టర్లు వచ్చి మన కులవ్యవస్థ మీద దెబ్బ కొట్టారు. బస్సులు, రైళ్ళు, సినిమాలు వచ్చి అందర్నీ కలగాపులగంచేసి ఒక చోట కూర్చో పెట్టాయి. నిలవనీరులావున్న సమాజం (stagnated society) మీదకు డాక్టరు ఒకరాయి వేశాడు. డాక్టరు కంటే ఒక మెట్టు తక్కువ డ్రెస్సరు. కంపవుండర్లు కూడా చాటుమాటుగా చిన్నచిన్న ప్రాక్టీసులు పెట్టి డబ్బు గుంజేవారు. దెబ్బలకి గాయాలకి టించెరయోడిన్, టించర్‌బెంజాయిన్ వాడేవారు. చిన్న చిన్న జ్వరాలకి మాత్రలు, డోకులు, విరేచనాలకు మాత్రలు వగైరా తెలుసుకుని చిన్న నకలీడాక్టర్లు వాడేవారు. మందుల షాపువాళ్ళు కూడా వైద్యాలు చేయడం కద్దు. అంతోయింతో వైద్యం తెలియనివాడు ఎవడూవుండడు అని సామెత. వైద్యం, కవిత్వం కాస్తకాస్త అందరికి తెలుస్తుంది అనేవాడుక. శానిటరీ ఇనస్పెక్టర్లు, యితర ఉద్యోగులు కూడా చిన్న చిన్న వైద్యాలు చేసేవారు.

మంత్రగత్తెలు, మంత్రగాళ్ళు కూడా తాయెత్తులు కట్టివైద్యాలు చేసేవారు. గారడీ చేసేవాళ్ళు కూడా వైద్యాలు చేసేవారు. వీరు గాకుండా మందుల వాళ్ళు అనే కులం వుండేది. కోయలు జ్యోతిషం చెప్పడం వైద్యం చేయడం కూడా వుండేది. సోది చెప్పేవారు కూడా చికిత్సలు చేసేవారు. ఇంకా పసర్లు మూలికలు తెచ్చి కొండవాళ్ళు వైద్యం చేసేవారు. పాము గాని తేలు గాని కుడితే ఎవరూ డాక్టర్ల దగ్గరకు కాకుండా పాము మంత్రం తేలు మంత్రం వేసేవాళ్ళ దగ్గరకు వెళ్లేవారు. పాముల నరసయ్య పేరు వినేవుంటారు. వాపులకు బెణుకులకు కూడా మంత్రం వేస్తారు.

ఇప్పుడు కాలం మారింది. డాక్టర్ల దాహం కూడా పెరిగింది. అవయవాలన్నిటికీ డాక్టర్లు వేరుగా వున్నారు. సెక్సు రోగనిపుణులు బయల్దేరారు. ఆస్పత్రులకు రోగులు ఎగబడటమే గాక పెద్ద పెద్ద బిజినెస్ కంపెనీలు కార్పొరేషన్లలాగ భారీ హాస్పిటళ్ళు వెలిసి వేలకు వేలు లక్షలు స్వాహా చేస్తున్నారు. గుండె మార్పిళ్ళు, గుండె ఆపరేషన్లు జరుగుతున్నాయి. లివర్లు కోసి అమ్ముకుంటున్నారు. ఆస్పత్రి పాలవడం అనేది ఒక అవాంతరం దుర్ఘటనగా పరిణమించింది. టానిక్కులు పెరిగాయి. దేశం సాంస్కృతిక జీవనంలో డాక్టర్లు భాగస్వాములవుతున్నారు. కొందరు డాక్టర్లు కేవలం మెడికల్ సర్టిఫికెట్లు యిచ్చి డబ్బు సంపాదిస్తున్నారు. జీవితం అన్ని రంగాలలోకి కొనడం అమ్మడం లాభాలు అనే వ్యాపార సంస్కృతి ప్రవేశించి రాజ్యం చేస్తున్నది. మనుషులకు ముఖ్యమైనది తృప్తి, సంతోషం. ఇవి డబ్బుతో లభించేవి కావు. డాక్టరీ చదువులకు లక్షలు లక్షలు ఖర్చు పెటి తిరిగి కోట్లు సంపాదించాలని ఆశిస్తున్నారు. ఆశయాబద్ధతేలోకే.

* * *

# అబద్ధాల కోర్లు

- డా. యు. ఎ.నరసింహమూర్తి

"But in that child the rhetorician's lie burst like a pipe'' అంటాడు Rimbaud ని స్మరిస్తూ W.H.Auden. అలంకారికమైన అబద్ధాన్ని అందరూ ఆమోదిస్తారు. అసలైన అబద్ధాన్ని మౌలికంగా తిరస్కరిస్తారు. మనకవులు సాక్షాత్తు సత్యహరిశ్చంద్రుడి చేతే అబద్ధమాడించే సామర్థ్య మున్న వాళ్లు. ''చతురంభోధి పరీత భూవలయ రక్షా దక్ష చామీకరాయత' అంటూ సాగిపోయే హరిశ్చంద్రుడి పద్యం శుద్ధాబద్ధమని అందరికీ తెలుసు.'దంతావళంబుపై బలవంతుడొక్కడు నిల్చి, అన్న నక్షత్రకుడి పద్యం హరిశ్చంద్రనాటకంలో ఇంకొక పెద్ద అబద్ధం. చరిత్ర మన చక్రవర్తుల్ని కొందర్ని త్రిసముద్రాధీశ్వరుల్ని చేసింది. కాని మనకవులు ప్రతి చక్రవర్తిని చతుస్సముద్రాధీశ్వరుల్ని చేసేరు, మనం అంగీకరిస్తూ వచ్చేము.

''హిమాలయం రెండు సముద్రాలకీ దాసి,రూళ్లకర్ర లాగ లేదట. యీశ్లోకం శుద్ధ అబద్ధంట'' అంటూ కాళిదాసు అబద్ధాల కోరని మహేశం ఆలంకారిక సత్యానికీ శాస్త్రసత్యానికీ మధ్యనున్న అంతరం తనకొక జీవిత సమస్యగా పరిణమించడాన్ని వెల్లడించేడు. అయినా ఇప్పటికీ మనం ఆలంకారికమైన అబద్ధాన్ని ఆమోదిస్తూనే ఉన్నాం. అసలైన అబద్ధాన్ని సిద్ధాంతపరంగా వ్యతిరేకిస్తూనే ఉన్నాం.

సత్యహరిశ్చంద్ర నాటకంలో అబద్ధమాడినవాడు లేడు. అయినా ఆ నాటకం వాస్తవమా? కల్పనా? నిజమా? అబద్ధమా? అని అందరూ సందేహిస్తూ ఉంటారు. ఆదర్శ సమాజాన్ని కాంక్షించే స్వాప్నికులు మాత్రం అది నిజమని, నిజం కావాలని ఉద్ఘోషిస్తూ ఉంటారు.

కన్యాశుల్కం అబద్ధంతో ఆరంభమై అబద్ధంతో ముగిసిన నాటకం. 'బొంకులదిబ్బ' మీద ఆరంభమయిం దా నాటకం. గిరీశం పూటకూళ్లమ్మతో సంతలో సామాను కొనిపెడతానని అబద్ధంచెప్పి ఇరవైరూపాయలు తీసికొని డాన్సింగు గర్లుకింద ఖర్చుపెట్టిన సంగతితో ఈనాటకం ఆరంభమయింది. ''ట్వూరిపెంటెన్సు ట్వంటీఫోర్ అవర్సు చాలదా అండీ'' అన్న అబద్ధంతో ముగిసింది. ఆ నాటకంలో అబద్ధం ఆడనివాడు గాని, అబద్ధానికి ఆసరాగా నిలవనివాడు గాని లేడు. ''అగ్ని హోత్రావధాన్లు ఆడినమాట తప్పుఛాడా'' అని అపరహరిశ్చంద్రుడిలా ప్రతిజ్ఞ చేసిన అగ్నిహోత్రుడు నాటకారంభంలోనే లుబ్ధావధాన్లకి నలభైయ్యేదేళ్లని అబద్ధమాడాడు. ఆ ఛాందసుడి దృష్టిలో అది నికార్సైన అబద్ధం కాకపోయినా, మన దృష్టిలో మాత్రం అతను కూడా అబద్ధాల కోరయ్యాడు.

ప్రపంచంలోని అబద్ధాలకు సంబంధించిన ఏ ప్రామాణిక వాక్యాన్ని గ్రహించినా దానికి తగ్గ నమూనా కన్యాశుల్కంలో కనబడుతుంది. కన్యాశుల్కం నాటకమంతా అబద్ధంతోనే నడచింది. అయితే విచిత్రమేమంటే ఆ నాటకమంతా నిజమేనని, అందులో అబద్ధం లవలేశం లేదని మన మందరం నమ్ముతాము.

కన్యాశుల్కం నాటకం తెలుగులో అబద్ధ సర్వస్వ మనవచ్చును. అందులో అబద్ధానికి లౌకికమైన, అలౌకికమైన, తాత్త్వికమైన, శాస్త్రీయమైన నిర్వచనాలు, అర్థాలు, అర్థచ్ఛాయలు కనిపిస్తాయి. పర్యాయ పదాలున్నాయి. చర్చలున్నాయి. ఉపన్యాసముంది. అబద్ధాల్లోను, అబద్ధాలాడే వాళ్లలోను అనేకమచ్చు లున్నాయి ఆణిముత్యాల్లాంటి అబద్ధాల్తోపాటు అదోమాదిరి అబద్ధాలు కూడా ఉన్నాయి. అబద్ధాల బేంకులున్నాయి. అబద్ధాల మీద జోకులున్నాయి; అబద్ధాలమీద సెంటిమెంట్లున్నాయి. అబద్ధప్రవృత్తులున్నాయి. అబద్ధాలకు రేట్లున్నాయి అబద్ధాలకు ఆటుపోట్లున్నాయి, అంతస్థులున్నాయి.

కొన్ని నిర్వచనాల విషయంలో శాస్త్రజ్ఞులు అన్వయ వ్యతిరేక పద్ధతి ననుసరిస్తారు. అంటే విషయాన్ని నిర్వచించకుండా దానికి వ్యతిరేకమైన విషయాన్ని నిర్వచించి విషయ నిర్వచనం తెలిసేలా చేసే పద్ధతి అన్నమాట. '' శుద్ధసత్యమనేది సాక్షాత్తు భగవంతుడితో సమానమైన వస్తువ'' అంటూ సత్యాన్ని నిర్వచిస్తాడు గిరీశం. అనిర్వచనీయ గాంభీర్యాన్ని నింపుకున్న ఈ నిర్వచనంతో గిరీశం శాస్త్రకారుల కోవకు చెందినవాడయ్యాడు. 'బ్రహ్మ సత్యం-జగన్మిథ్య' అన్నది అందరికీ తెలిసిన వేదాంతవాక్యం. అందుచేత పరబ్రహ్మ శుద్ధసత్యానికి సంకేతమైతే, మిథ్యాజగత్తు అబద్ధంగా మిగిలిపోతుంది. అందుకే కన్యాశుల్కం ఒక అబద్ధ ప్రపంచంగా అవతరించింది.

అబద్ధ తాత్త్వికులు కూడా కన్యాశుల్కంలో కనిపిస్తారు. '' వెఱ్ఱి! వెఱ్ఱి! నిజవేఁవిఁటి! అబద్ధ వేఁవిఁటి! మేంసిద్ధులం అబద్ధం నిజం చేస్తాం నిజం అబద్ధం చేస్తాం.'' లోకవేఁపెద్ద అబద్ధం''. ఈతత్త్వ బోధని పారలౌకిక పరిభాషలో అర్థం చేసుకోవాలో, లౌకిక భాషలో అర్థం చేసుకోవాలో తెలియని సందిగ్ధంలో పడతాడు సగటుమనిషి. ఈతాత్విక సందిగ్ధత చెరిపి చక్కని లౌకిక పరిభాషలో 'నిజవేఁటి బాబూ? అబద్ధవేఁటి బాబూ?' అంటూ సరళంగా విషయబోధ చేస్తాడు పోలిశెట్టి.

అబద్ధ సిద్ధాంతం సంగతి అలా ఉంచితే అబద్ధానికి సంబంధించిన లౌకికతత్త్వాన్ని గురించి గిరీశం తన లెక్చర్లో ఇలా సెలవిస్తాడు: ''లోకోభిన్న రుచిః'' అన్నారు. కొందరికి అబద్ధం రుచి, కొందరికి నిజం రుచి, చాలా మందికి రెండింటి కలగలుపు రుచి. ఇది లోకస్వభావం'' అంటూ. అబద్ధాలపుట్ట అయిన గిరీశం ఈవిషయంలో మాత్రం అపారమైన అనుభవంతో నిజం చెప్పేడు.

జల్లి-బూరుడ-బొంకు-పొల్లు-దబ్బఱ-సట-హుళక్కి-డబ్బు-తక్కు- టక్కు-తవళి -తవళి-తుసుకు-నసుకు- దుద్దు-తటతట-తవతవ-లాంటి అచ్చతెలుగు పర్యాయ పదాలతో పాటు అసత్యం-అనృతం వంటి సంస్కృత పర్యాయ పదాలుకూడా అబద్ధ ప్రకరణంలో మనకుకనిపిస్తాయి. కన్యాశుల్కంలో తస్సా-గోతం-బనాయింపు-మర్మం-దాట్లు-జల్లి-కవిత్వం-వెకాస్యం-కల్పన వంటి మాటలు అబద్ధ పర్యాయపదాలుగా మనకు కనిపిస్తాయి. తస్సా గిరీశం మాట, గోతం రామప్పంతులు మాట. 'బనాయింపు' అంటే రూపం దాల్చిన

అబద్ధమన్నమాట. 'బుద్ధి దాటేయడం' ప్రేరణరూపమైన అబద్ధం. 'గోతాలుకొయ్యడం' అబద్ధాతిశయోక్తి. 'కవిత్వంపన్నడం' అబద్ధానికి నిరాలంబన్యత్యరూపం. 'జల్లీలెగపొడిచి సాక్ష్యం, పలకడం అనర్గళరూపమైన అబద్ధం,' పేలుడికాయి వైదీకప గుంటడి వెకాస్యాలు పరిగణనకు రాని అబద్ధప్రతిరూపాలు. 'కాస్త కల్పనుంటే కాని కధనడవక పోవడం' అబద్ధనైజం. ఇలా కన్యాశుల్కం అబద్ధ పర్యాయపదాల్ని, అర్థచ్ఛాయల్ని కూడా ప్రదర్శిస్తుంది.

'అబద్ధానికి అర్థవేఁవిఁటి?' అని మధురవాణి శిష్యరూపంలో అడిగితే గురువు రామప్పంతులు పలికిన అబద్ధోపనిషద్వాక్యాలిలా ఉన్నాయి. ఆయన అబద్ధం ఒక వృత్తి అన్నాడు. 'ఉద్యోగ ధర్మం లౌక్యవృత్తి' అని సూత్రం. దానికి లౌక్యవృత్తి అని విరోధాభాసతో కూడిన ధర్మసూక్ష్మాన్ని వివరించాడు. అబద్ధానికి లౌక్యం ఒకపార్శ్వం-మోసం ఇంకొకపార్శ్వం. కన్యాశుల్కం నాటకంలో ఈరెండు పార్శ్వాలూ అనితరసాధ్యంగా, ఆమూలాగ్రంగా ప్రదర్శింపబడ్డాయి. ఇందులో ఒక పార్శ్వం రామప్పంతులిదైతే, ఇంకొకపార్శ్వం గిరీశానిది. 'నమ్మించోటచేస్తేమోసం. నమ్మంచోట చేస్తే లౌక్యవూఁను'' అన్నది అబద్ధోపనిష ద్వాక్యం. ఈవాక్యం ప్రకారం గిరీశం మోసగాడు, రామప్పంతులు లౌక్యుడు.

గిరీశం రామప్పంతులు చిక్కడు-దొరకడు లాంటి వాళ్లు. ఒకడు ఆకుల మీద నడిస్తే ఇంకొకడు చిగుళ్లమీద నడచినవాడు. ఆకులు చిగుళ్లూ కాకవేళ్లలో దూరి అబద్ధవృక్షం అంతస్సారంగా పాకినవాడు కరటకశాస్త్రి. గిరీశానికి అబద్ధం హాబీ! రామప్పంతులికి అబద్ధం వృత్తి. అందుకే గిరీశం మోసగాడు రామప్పంతులు లౌక్యుడు. రామప్పంతులితో సహా తనఎదుట బడ్డవారినందరినీ తన అబద్ధాలతో నమ్మించి మోసగించినవాడు గిరీశం. రామప్పంతుల్ని కన్యాశుల్కం నాటకంలో ఒక్కరూ నమ్మలేదు. కాని కనబడ్డ ప్రతి వాళ్ల మీద తన లౌక్య ప్రజ్ఞ ప్రదర్శించి, అబద్ధాలు కురిపించడం మాత్రం రామప్పంతులు మానలేదు.

"I do not mind lying but I hate inaccuracy' అన్న Samul Buttler గిరీశంలో కనిపిస్తాడు. 'ప్రమాదాల్తప్పించుకోవడమే ప్రజ్ఞ. ఒక తప్పు వేశాఁవంటే అది బ్రహ్మభేద్యంగా ఉండాలి' అని వెంకటేశానికి ఉపదేశిస్తాడు గిరీశం, ఈ అబద్ధ సౌష్ఠవంతోనే ' ఊరంతా నేను సత్యహరిశ్చంద్రుణ్ణిగా భావిస్తున్నారు'' అనే స్థాయికి ఎదిగాడు. '' వీణ్ణి పెందరాళే తోవన పెట్టకపోతే మోసం వొఁస్తుంది'' అని కరటక శాస్త్రి ఆలోచించినా, '' ఈశషభిషలు నా దగ్గిర పనికిరావు'' అని అగ్ని హోత్రుడు ధుమధుమలాడినా- చివరికి గిరీశం అబద్ధాల ఉచ్చులో పడక తప్పలేదు. వృత్తికళాకారుడైనా రామప్పంతులికి ఈ అబద్ధసౌష్ఠవం అబ్బలేదు. అందుకే అడుగడుగునా అతనికి శృంగభంగం జరిగింది.

"An evil tongue never stops inventing lies" అన్న Lorca మాటకొస్తే గిరీశం రామప్పంతుల్ల నాలుకలు అబద్ధపు ఆకురాళ్లు అనిపిస్తుంది. ఈ కళలో వీరిద్దరినీ తలదన్నగలిగినవాడు బైరాగి. పురాణాలు, కావ్యాలు జానపదగాధలు ఇలాంటి వాటిలోని అబద్ధ

కోశాలెన్నో పరకాయప్రవేశం చేసి బైరాగి మాటలుగా అవతరిస్తాయి. అబద్ధ పరివేషంతో ప్రజ్వరిల్లిన సిద్ధుడు బైరాగి. కన్యాశుల్కంలో ఆదినుండి అంతం అంతం దాకా విసుగు విరామం లేకుండా అబద్ధాలను సృష్టించిన వాళ్లు గిరీశం. రామప్పంతుళ్లే అయినా అబద్ధాల మెరుపు దాడి చేసిన వీరుడు మాత్రం బైరాగే.

""A liar is always extravagant with his Oaths" అన్న Pierre corneille మాటను కూడా గురజాడ మరచి పోలేదు. గాయిత్రి పట్టుకు ప్రమాణం చేసిన వాడొకడైతే, గాయిత్రి సాక్ష్యంతో పాటు దీపాలార్పి ప్రమాణం చేసిన వాడింకొక అబద్ధాలకోరై కన్యాశుల్కం కధని రక్తి కట్టించేరు. అబద్ధవాఁడితే తలపేలిపోతుందంటాడు రామప్పంతులు. 'మేం చేసే స్వర్ణం మేవేఁ వాడుక చేస్తే తలపగిలిపోతుంది' అంటాడు బైరాగి. ఈవిద్యలో వీళ్లిద్దర్నీ అధిగమించి, బైరాగికి గురువుకాగల ప్రజ్ఞను తనలో నిరాడంబరంగా దాచుకున్నవాడు అసిరిగాడు. ''అబద్ధవాఁడితే బగవంతుడు ఒల్లకుంతాడా బాబు!' అంటూ అలవోకగా అబద్ధమాడి నిర్వికారంగా నిలదొక్కుకోగల సత్తా ఉన్నవాడు అసిరిగాడొక్కడే. అబద్ధపు సెంటిమెంటును ఆకళించుకున్న అద్భుత మేధావి అసిరిగాడు.

అబద్ధం ఇంకొక అబద్ధానికి జన్మనిస్తుంది. అబద్ధాల కోర్లు అబద్ధం కోసమే అబద్ధమాడతారు. వంటి అభిప్రాయాలు కూడా శత శతాంశసత్యాలన్నసంగతి కన్యాశుల్కం ద్వారా మనకు తెలుస్తుంది 'అది కాలుపెట్టిన ఇల్లు పది ఇళ్లౌతుందట. పట్టిందల్లా బంగరమౌతుందట'' అన్న అబద్ధం నుంచి 'వివాహ, ధనయోగాలు జవిఁలిగా ఉన్నాయి' వంటి అబద్ధాలు పుట్టాయి, గిరీశం వెంకటేశంతో, బుచ్చమ్మతో కొట్టిన లెక్చర్లలో అధిక శాతం 'అబద్ధం అబద్ధం కోసమే' అన్న సూత్రంలోంచి పుట్టినవే.

అబద్ధానికి గీటు పెట్టినవాడు గిరీశం, రేటు పెట్టినవాడు రామప్పంతులు. వెంకటేశానికి తరిఫీదు ఇచ్చిన దగ్గరనుండి ''మీయిష్టవొఁచ్చినట్టల్లా మీకు పనికివొచ్చే అబద్ధాలు మీరు పలికించడముకు నా అభ్యంతరమెంతమాత్రము లేదు'' అంటూ పేటెంటు హక్కులు ప్రసాదించే దాకా గిరీశం అబద్ధానికి గీటు పెట్టూనే ఉన్నాడు. ' ఉర్లాం బసవరాజుగారి సంభావన రేటే సాక్ష్యాలక్కూడా అంటూ అబద్ధపు రేట్లకు గెజిటార్డరు వేయించిన ఘనుడు రామప్పంతులు.

ఎప్పటికప్పుడు అబద్ధపు కత్తీ-కతారు నూరుతూ ఉంటాడు గిరీశం. ప్రదర్శించ వలసిన చోట యిలోక్వెన్సు ప్రదర్శిస్తాడు లేనిచోట స్వేచ్ఛావిహారం చేస్తాడు. ఎదుటి వాడికి ఎంతగా ఎడ్యుకేషన్ లేదో రీజన్ తెలియదో గమనించి దానికి తగ్గంతగా అబద్ధప్రయోగం చేస్తుంటాడు. రామప్పంతులు అబద్ధాల్లో ఇంత వాడి, వేడి కనబడవు. 'రావఁనాయుడి మాటమాత్రం శుద్ధాబద్ధం' 'వొట్టబద్ధాలు' అంటూ తడవతడవకు అబద్ధమనే మాటను వాడుక చేయడం రామప్పంతులు అలవాటు. అంతేకాని ఆడిన అబద్ధాన్ని సమర్ధించుకునే ప్రయత్నంలో అతను గిరీశానికి తీసికట్టే. చూడగా చూడగా గిరీశం అబద్ధపరిశోధకుడుగా, రామప్పంతులు అబద్ధవ్యాపారిగా కనిపిస్తారు.

అబద్ధానికి ఆమోదపత్రాలున్నాయి. ''భూతహితంబుగా పలుకు బొంకును సత్య ఫలంబునిచ్చు,-దదభూత భయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్ల'' (ఆం.మ.భా.అరణ్య.5 ఆ.అకప.) అంటూ ధర్మసూక్ష్మాలను వివరించిన ధర్మవ్యాధుడు రెండు చోట్ల (ప్రాణభయంవము, పెళ్లి) నేరం కాదన్నాడు. శర్మిష్ఠ ఐదుచోట్ల (ప్రాణాత్యయము, సర్వధనాపహరణము, విప్రవధ, వధూజనసంగమము, వివాహసమయము) అసత్యం కలగదని ముని వచన ప్రమాణం చూపించింది. శుక్రుడు ఏడు సందర్భాలలో (వారిజాక్షులు-వైవాహికములు-ప్రాణ, విత్త, మానభంగములు-గోకుల, అగ్ర జన్మరక్షణములు) బొంకినా పాపం రాదని బలిచక్రవర్తికి చెప్పేడు. "A lie in time saves nine'' అంటాడు Addison Mizner. ఈ తత్త్వంలోంచి పుట్టిన అబద్ధావతారం గుంటూరు శాస్త్రులు. అతని అంశావతారం మాయగుంట అసలేనటుడు ఆపై అబద్ధావతారం. అటు లౌక్యం- ఇటు మోసం రంగరించి రామప్పంతుల్నీ గిరీశాన్నీ సైతం గిరి కీలు కొట్టించిన అబద్ధశిరోమణి గుంటూరు శాస్త్రులు. అబద్ధానికి ఆటుపోట్లు ఎలా వస్తాయో కన్యాశుల్కం నాటకంలోని ఈ ప్రాసంగిక వృత్తాంతం పతాకస్థాయిలో వెల్లడించింది, అబద్ధానికి అందమైన అంచుకుట్టింది. అబద్ధమాడిన వాళ్ల స్వయంగా వెల్లడి చేసే దాకా ఏ అబద్ధమైతే వెల్లడికాదో అదే అసలు సిసలైన అబద్ధం. మధురవాణి వెల్లడించేదాకా ఈ అబద్ధావతారపు అనుపాన్లు ఎవరికీ అందలేదు.

గురజాడ తెలుగువాళ్లకి స్త్రీలనుగౌరవించడం నేర్పేడు. '' ఆడముండల్తో ఆలోచనేవిఁటి'' అన్న అగ్నిహోత్రుడి లాంటి వాళ్లని, ''ఫెమినైన్సు ఫూల్సన్నాడు' అన్న గిరీశం లాంటి వాళ్లని, శవాలకు తాళికట్టేలుబ్ధులను లోకం అసహ్యించుకునేలా చేసేడు. వేశ్య మధురవాణి, దండుముండ పూటకూళ్లమ్మ, సాంసారిక వ్యభిచారి మీనాక్షి, సామూహిక వ్యభిచారి యోగిని ఇలా నాటకంలో పతితులైన స్త్రీల మీద కూడా జాలి కలిగేలా చేసేడు కాని అసహ్యం పుట్టేలా చేయలేదు. అది గురజాడ సంస్కారం. కాని అబద్ధాల విషయంలో మాత్రం ఆడవాళ్లను సైతం విడిచి పెట్టలేదు. కన్యాశుల్కంలో ఏ ఒక్క స్త్రీ అయినా సత్యభామలా ''బొంకులు మాచవిగావు'' అని నిబ్బరంగా గుండెమీద చేయి వేసుకుని చెప్పలేదు.

ఆడవాళ్ల అబద్ధాలాడ్డంలో మగవాళ్లకంటే రాటుదేలిన వాళ్లని లోకంలో వాడుక. "Fraility thy name is woman' అన్న Hamlet మాటలో ఇదికూడా ఒకభాగమే. అబద్ధ విద్య ఒకరు నేర్పకుండా ఆడవాళ్లకు పట్టుపడుతుందని(స్త్రీణామ శిక్షిత పటుత్వ మమానుషీషుసందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః), నిలుచున్నపాటున అబద్ధమాడే తత్త్వం ఆడవారి దని (ప్రత్యుత్పన్న మతిస్త్రైణమ్) దుష్యంతుడి నోట కాళిదాసు పలికించేడు. ఇతరులుకూడా ఇలాగే అనుకున్నారని "with a man, a lie is a last resort, with woman it is First Aid'' అని frank Gellet Burgess అన్న మాట చెప్తుంది. ''మీరిచ్చిన రూపాయలు పట్నం తోలేసాను'' ''దిగదుడుపు కాదంటే నమ్మరుగా'' ''పెట్టె తాళం పోయింది'' ''ఏకాంత ఉపదేశం చేస్తున్నారు'', ఇలాంటి అబద్ధాల వెనుక ఒక ప్రయత్నం ప్రణాళికా కనబడవు. గాలి పీల్చినంత

సహజంగా వెలువడ్డ అబద్ధాలివి. అబద్ధానికి ఆడదానికి ఉన్న అవినాభావసంబంధాన్ని ఇలా స్థాపించినా కన్యాశుల్కంలో ఏ ఆడదాని అబద్ధమూ ప్రమాదకారి కాకుండా చూసుకున్నాడు గురజాడ. అంతేకాదు. ఆణిముత్యాల్లాంటి అబద్ధాలన్నీ మగవాళ్ల నోటే పలికించాడు.

'' ఏమైనా సహించగలను గానండి అసత్యం అన్నది సహించలేనండి'' (గిరీశం)

''నేను యన్నడూ అబద్ధవాఁడి యెరుగను (రామప్పంతులు) అది కామినీపిశాచం (గవరయ్య) 'తృణం కణం ఏవొఁచ్చినా మఠానికే అర్పణ' (బైరాగి) ఇలాటి అబద్ధాలాడిన వాళ్లంతా మగవాళ్లే.

ఆడైతేనేం-మగైతేనేం అందరూ కలిసి అబద్ధాల్లో అనంత వైవిధ్యాన్ని ప్రదర్శించారు.

'' ఎన్నోళ్లైతేనేమి? నలభైయ్యేయిదు'' (అగ్నిహోత్రావధాన్లు) తాత్కాలికాబద్ధం

''బృహన్నారదీయం నాలుగవ ఆశ్వాసం'' (గిరీశం) ప్రామాణికాబద్ధం. ''గాయిత్రి పట్టుకు ప్రమాణం'' (గిరీశం) సెంటిమెంటు అబద్ధం.

''వెధ్వల్ అంటే లాటిన్లో కోర్టండి'' (గిరీశం) ఆపద్ధర్మాబద్ధం.

''మీరన్న మనిషి యిక్కడ లేరంటే నమ్మరుకదా!'' (మధురవాణి) నోటితో అబద్ధం నొసలితో నిజం.

'' ఓలమ్మ! ఎంత బలువుం దోస్సి'' (అసిరిగాడు) శుద్ధాబద్ధం.

''మా యింట్లోళ్లకి ఉద్దోలమైనజబ్బుగా ఉందని కబురు పెట్టారు బాబూ'' సంభావ్యాబద్ధం.

''గంగంతా సారా అయిపోయింది'' (బైరాగి) అసంభావ్యాబద్ధం.

''రామప్పంతులు బనాయించిన జాతకం'' సరూపాబద్ధం.

''అరుగో! ఆరేటి బాబూ! ఆరు నాకగపడుతున్నారు'' విరూపాబద్ధం.

''యెంత న్యాయంగా సంచరించినా, మీ హృదయంలో కాసింత కనికరం లేదు కదో!'' (మధురవాణి) వృత్తి అబద్ధం.

''నిలబడ్డ పాటున నూరు కంటెలు కురిపిస్తాను'' (రామప్పంతులు) అబద్ధాతిశయోక్తి.

''నాలుగ్గడియల రాత్రుందనగా శుభముహూర్తం'' సాంకేతికాబద్ధం.

''కోదండ రామస్వామివారు స్వయం వ్యక్తవూ, హనుమత్ప్రతిష్ఠ'' (కరటకశాస్త్రి) సాంప్రదాయికాబద్ధం.

''పేరి రామశాస్త్రులుగారు''(సిద్ధాంతి) ప్రకటమైన అబద్ధం.

''శాస్త్రచర్చ చేసి, లగ్నం పది నిముషా లుందనగా ఏకరాత్ర వివాహం స్థిరపరచారు'' సామూహికాబద్ధం.

ఇలా విశ్లేషిస్తూ పోతే ఈ అబద్ధ ప్రపంచం అనంతంగా విస్తరిస్తుంది. ఈ విస్తరణకు ఆడామగా తేడా లేకుండా తగినంత మాటసాయం చేసారు.

కన్యాశుల్కానికి ఆత్మ మధురవాణి. అబద్ధంలోంచి మొలిచిన నిజం. కాలుజారిన సత్పురుషుడి వల్ల. ''అన్పతం మూలమాత్మనః'' అన్నది భాగవతవాక్యం. పోతన మాటల్లో

చెప్పాలంటే '' ఆత్మవృక్షము-మూలమనృతంబు-నిశ్చయ మనృత మూలంబు గల్గు నాత్మ చెడదు-పుష్పఫలము లాత్మభుజమునకు సత్య మాత్రమాను బ్రతుకమి నవియుఁజెడును ''అని వివరంగా తెలుగులో ఉంది. Lies are essential to mankind అన్న Marcel proust మాట మధురవాణిని చూస్తే నిజమనిపిస్తుంది. కన్యాశుల్కం నాటకవృక్షానికి ఆత్మ మధురవాణి. అబద్ధం మధురవాణి మూలధనం. ఆ మూలం శాఖోపశాఖలతో కూడిన వృక్షంగా విస్తరించి, పుష్పించి, ఫలించి నాటక ప్రయోజనాన్ని సాధించింది. ఆ ఫలమే సత్యం. ఆ సత్యసాధనకు ప్రతీకగా మధురవాణి భగవద్గీతను చేపట్టింది. సత్యసాక్షాత్కారం అనేకులకు అనేక విధాలుగా జరుగుతుంది. మధురవాణికి ఈ విధంగా జరిగింది. ఈ సాధన కొక గురువు అవసరం. ఆ గురువే సౌజన్యారావు పంతులు.

'' ఎన్నడున్ బొంకని ధర్మరాజులు'' అన్న జక్కన మాట సౌజన్యారావు పంతులు విషయంలో నిజమయింది. ''సౌజన్యారావు పంతులు సత్యసంధుడు''అన్నది ఆయన పరిచయవాక్యం. ''తమరు ధర్మస్వరూపులు'' అని రామప్పంతులొక నిజం చెప్పేడు. '' ఆయన బహుయోగ్యమయిన మనిషి'' అంటాడు కరటకశాస్త్రి. ఇంకా తరవాత ఒకరొకరుగా ఆయన వ్యక్తిత్వాన్ని పెంచుకుంటూ పోయారు.కాని ఆయన మాత్రం నిజానికి దగ్గర కాలేకపోతున్నాని నిత్యం భాదపడుతూ ఉండేవాడు. ఆయన వృత్తి అలాంటిది, సాక్షులు లేనిదే అతని కధనడవదు ''బాలకుండు-వృద్ధు -హహాడు-చుట్టంబు-బూతు-సూనాడు-పాతకుండు-బొంకులాఁడు-ముచ్చు-ముండలి-కొండీఁడు కల్లు ద్రాగుదాడు గాఁడు సాక్షి అని విజ్ఞానేశ్వరీయం చెబుతుంది. మరి సౌజన్యారావు పంతులుకి సరైన సాక్షి ఎలా దొరుకుతాడు. ''నిజవాఁడే వాఁడు సాక్ష్యానికి రాడు, సాక్ష్యాని కొచ్చిన వాడు నిజవాఁడ్లేడు. క్రాసెగ్జామినేషన్ ఆరంభమయ్యే సరికి ఎంతటివాడూ కవిత్వం ఆరంభిస్తాడు'' అని అబద్ధాలతో తనకు గల సుదీర్ఘానుభవాన్ని ఆయన వెళ్లబోసుకున్నాడు. అబద్ధం అంటకూడదని ''మధనపడి మధనపడి'' ఆఖరికి న్యాయవాదవృత్తిని వదులుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఇలాంటి సత్పురుషడితో కలిసి అబద్ధం మీద ఒకనవ్వులజల్లు కురిపించాలన్న కొంటితనం గురజాడకు కలిగినట్లుంది.

గిరీశం : వకీళు అబద్ధా లాడిస్తే న్యాయం పుచ్చుకునే జడ్జీయేం చేస్తాడండీ''?

సౌజ : ఉభయపార్టీల వకీళ్లు ఆడించే అబద్ధాలన్నీ చెయ్యి పీకే ట్టు రాసుకుంటాడు.

అంటూ పరిహాసంలోనే ఒక ప్రగాఢమైన ప్రతాపాన్ని ప్రదర్శిస్తాడు ఆఖరికి ''అనత్యవఁనేది ఎవరితోనూ ఆడకూడదు'' అంటూ అబద్ధాన్ని సమాజపు పొలిమేరల్లోంచి నెట్టడానికి ఆరంభిస్తాడు గిరీశం. అదే అబద్ధాన్ని మధురవాణి అనే సత్యం వెల్లడి చేస్తే దానిని సమాజపు సరిహద్దులు దాటేవరకు బయటకునెట్టి అబద్ధసమాజపు కధను అడ్డంతిప్పినగురువు సౌజన్యారావు పంతులు. గురుజాడ సాధించిన ఈ ముగింపును చూచినప్పుడు "His truth is acceptable to lying men" అన్న Auden వాక్యంతో ఈ వ్యాసాన్ని ముగించాలనిపిస్తుంది..

*గురజాడ వారి వర్ధంతి (నవంబరు 30) సందర్భంగా*

# బాల్జాక్ (1799-1850)

- కాకాని చక్రపాణి

- డా॥డి.చంద్రశేఖర్ రెడ్డి

నవలా రచయిత లెందరికో స్ఫూర్తి నిచ్చిన ఫ్రెంచి నవలా రచయిత జనరీ ద బాల్జాక్. పందొమ్మిది, ఇరవై శతాబ్దాలలో మహామహులైన వారెందరో ఈయన్ని ఆదర్శంగా స్వీకరించారు. ఫైడోర్ డోస్టవిస్కీ, కార్ల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఏంజల్స్, హెన్రీ జేమ్స్, ఆస్కార్‌వైల్డ్, మార్సెల్ ప్రౌస్ట్, ఆల్డస్ హక్జలే లాంటి వాళ్ళు తమ జీవితాంతం ఆయన్ని ప్రశంశిస్తూనే వున్నారు.

జీవితం :- బాల్జాక్ ఫ్రాన్సులోని తూర్స్ (Tours) లో మే 20, 1799న జన్మించాడు. తండ్రి వ్యవసాయిక కుటుంబానికి చెందినవాడు. తల్లి వ్యాపారస్తుల వర్గానికిచెందినది. ఆమెది న్యూరోటిక్ టెంపర్‌మెంట్. ఆమెనుండే ఆయనకు అనేక కుహనా విజ్ఞాన శాస్త్రాల్లోనూ, అక్కల్టిజం (mesmerism, magnetism, somnabalism, phisiognomy, illumunism) లాంటి వాటిల్లో ఆసక్తి వారసత్వంగా సంక్రమించింది. వెన్‌డోంలోనూ, పారిస్‌లోనూ విద్యాభ్యాసం చేశాడు. మూడేళ్ళు లాయరు గుమస్తాగా పనిచేశాడు. ఆతరవాత ఆయన సాహిత్య జీవితం ప్రారంభమైంది.

విషాదాంత నాటక కర్తగా (cromwell,1819) ఆయనంత రాణించలేక పోయారు. వివిధమైన కలం పేర్లతో కథలూ, నవలలూ రాసినా, ఆయన స్వంత పేరు మీద ప్రచురితమైన మొదటి నవల Les Chonaus. 1799లో పడమటి ఫ్రాన్సులో రాయలిస్ట్ గెరిల్లావార్‌ఫేర్‌ని ప్రతిబింబించే నవల ఇది. తరువాతది La physiologie du mariage. పైకి హాస్యాన్ని, వ్యంగ్యాన్ని ప్రదర్శించే నవల ఇది. ఇందులో అంశం వైవాహిక జీవితంలోని అనైతిక ప్రవర్తన. అలాంటి అనైతికతకు కారణాలను వెతికి ఎలా దాన్ని సరిదిద్దాలో సూచించే నవల ఇది. ఈ నవలలో ఆయన స్త్రీలపట్ల ఒక ప్రగాఢ సానుభూతిని, వారిసమస్యల పట్ల అవగాహననూ కనబర్చాడు. ఈ అంశం ఆయన తరవాత రాసిన నవలల్లో మరింత స్పష్టమై ఆయన కీర్తిని సుప్రతిష్ఠితం చేసింది.

బాల్జాక్ భిన్న ప్రకృతుల మనిషి. ఆయన తూర్స్ లాంటి ప్రాంతీయపట్నం నుండి వచ్చిన మనిషయినా పారిస్ పట్టణ వాసి అయ్యాడు. వ్యక్తిగా దురుసుతనం కొంత అలగాతనం వున్న మనిషి. కీర్తి, సంపద, ప్రేమ లను పొందాలన్న అమితకాంక్ష. అన్నిటి కంటే మిన్నగా తన మేధావిత్వంపట్ల స్పృహ కల్గినమనిషి. అందువల్ల ఆయనసాహిత్యంలోనే కాక, ఆనాటిఫాషనబుల్, అరిస్టోక్రటిక్‌సమాజంలోనూ స్థానం సంపాదించాలని కృషిచేశాడు. 1828-34ల మధ్య ఆయన జీవితం మహా ఆడంబరంగా వుండేది. ఆదాయానికి మించిన వ్యయం చేసేవాడు. విలాస పురుషుడిగా, నాగరికుడిగా జీవితం గడిపాడు. తను ధరించే ఖరీదైనగుడ్డలు, రెండు చక్రాల బండి, వెంటసేవకుడు, విలాసవంతమైన చేతికర్ర,మిగతా ఆడంబరాలతో ఒకోసారి హాస్యాస్పదంగా కన్పించే వాడాయన. గమ్మత్తయిన కథలు చెప్తూ వినోదాన్ని కల్గించే ఆయన్ని సమాజం సహర్షంగా స్వీకరించింది. అదంతా బాహ్య పటాటోపమే. ఇంట్లో తెల్లటి నిరాడంబరమైన డ్రస్సింగ్ గౌను వేసుకుని, విపరీతంగా కాఫీ తాగుతూ, బాతురెక్క కలంతో రోజుకు 14-16 గంటలు

పనిచేస్తూండేవాడు. బాహ్యాడంబరమంతా-ఈ నిష్ఠురపరిశ్రమనుండి కొంత విశ్రాంతి పొందటానికి చేసే ప్రయత్నమే. డబ్బు సంపాదించాలన్న విపరీతమైన తపన ఆయన కుండేది. అయితే, డబ్బును ఆరాధించే ఆ కాలాన్ని అప్పటికే దుయ్యబట్టడం మొదలెట్టాడాయన. సంపాదకుల్నీ, ప్రచురణ కర్తల్నీ డబ్బుకోసం పీడించేవాడు. ఇదంతా బాహ్యమే. ఆయనలో వున్న అద్భుత సృజనాత్మక వాంఛకూ, జనాన్ని సరైన మార్గంలో పెట్టాలన్న ఆయన తపనకూ ఇవన్నీ దాసోహమే.

పద్దెనిమిదవ లూయీ, పదో ఛార్లెస్‌ల పరిపాలన పత్రికల్లో వాగ్యుద్ధానికీ వ్యంగ్యపూరిత రచనలకూ దోహదం కల్గించింది. చవకబారు రచనలకు ప్రజాదరణ బాగా పెరిగిపోయింది. ఈ పరుగుపందెంలో ఆయనా పాలుపంచుకున్నాడు. La Renovateur, La Revue de Paris లకు ఆయన రాశాడు. సంపాదకులతో పోట్లాట పెట్టుకునేవాడు. చివరకు పత్రికావ్యాసంగ మంటే ఏవగింపూ కలిగింది. ఆ తర్వాత ఆయన పత్రికల మీద దాడి చేస్తూ రాసిన వ్యాసాలు ఎప్పటికీ గుర్తుంచుకో దగినవి.

1835 దాకా ఆయన తన ర్యూ కాసినీ ఫ్లాటులో ఎంతో ఒత్తిడికి గురవుతూ పనిచేశాడు. బాకీదార్లు అప్పు తీర్చమని వేధించటం అధికమైంది. వాళ్ళ నుండి తప్పించుకోటానికి నగరానికి దూరంగా ఓ చిన్న ఇల్లు తీసుకున్నాడు. లాయరు నోటీసులను తప్పించుకోటానికో తెలివైన పథకం వేశాడు.

ఆయన కెందరో స్త్రీలతో సన్నిహిత సంబంధాలుండేవి. ఆయన తొలి ప్రేయసుల్లో పేర్కోనాల్సినామె మదాంలార్‌చెన్సీ. 1832లో కౌంటెస్ ఇవాలిన్ హన్స్కాతో పరిచయమైంది. ఆ ప్రేమ పరిణయంలోకి దారితీయటానికి చాల కాలం పట్టింది. మొదటిగా వాళ్ళు ఆమె ముసలి భర్త చనిపోయేదాకా నిరీక్షించాలనుకున్నారు. ఆ తర్వాత ఆమె వివాహానికి విముఖత చూపింది. చివరికి ఆయన ఆగష్టు 18,1850లో చనిపోతాడనగా వారి వివాహం మార్చిలో జరిగింది.

La Comedie Humaine:-1834వ సంవత్సరం బాల్జాక్ జీవితంలో పతాక స్థాయి. అప్పటికల్లా తన రచనలన్నిటినీ ఓ సంకలనంగా వేయాలనే ప్రణాళిక ఆయన మనసులో రూపు దిద్దుకుంది. అందులో మూడు వర్గాలుంటాయి. Etudes Analyliques (విశ్లేషణాత్మక అధ్యయనాలు) - మానవ జీవితం, సమాజం, దాన్ని శాశించే సూత్రాలను గురించినదిది. Etudes philosophiques (తాత్త్వికాధ్యయనాలు) - మానవ కార్యకలపాలకు కారణాల్ని హేతువుల్ని శోధించే భాగమిది. Etudes de moeurs (ప్రవర్తనా అధ్యయనాలు) ఆకారణాలు ఎలాంటి ఫలితమిస్తాయో చూపే భాగమిది. ఇందులో ఆరు రకాల ప్రైవేట్, ప్రావిన్షియల్, పారిషియన్, పొలిటికల్, మిలటరీ, రూరల్, జీవిత దృశ్యాల్ని ప్రతిబింబించే రచనలూ సంకలితమవుతాయి.

ఈ ప్రాజెక్టంతా 12 వాల్యూంలుగా (1834-37) వెలువడింది.1837 కల్లా ఆయన ఇంకా చాలా రాశారు. అప్పుడు ఆయనకు తట్టింది డాంటే నమూనా తన సంకలనానికి పేరు La comedie Humaine. ఆ పేరు మీద ప్రచురించటానికి ఆయనో ప్రచురణ కర్తల కన్సార్షియంను కలిశారు. ఫలితంగా 1842-1848ల మధ్య La Comedie Humaine 17 వాల్యూంలుగా ప్రచురింపబడింది. 1845 తర్వాత ఇంకా మరి కొన్ని కొత్తరచనల్ని దాంట్లో చేర్చాల్సివచ్చింది

దానికై అయన పథకం వేయసాగారు. చివరకు 1869-1876ల మధ్య, ఆయన చనిపోయిన తర్వాత La comedie Humaine 24 వాల్యూంలుగా ప్రచురింపబడింది.

బాల్జాక్ రచనల్లో మచ్చుకు రెండు:

1996లో ప్రచురితమైన బాల్జాక్ జీవిత చరిత్రను రాసిన గ్రాహం రాబ్ అభిప్రాయంలో బాల్జాక్ 1835లో రాసిన Le Pere Goriot ప్రముఖమైన నవల. ఈ నవల ధనస్వామ్యవ్యవస్థ ప్రథమ దశలో వున్న సమాజాన్ని ఫ్రెంచి చరిత్రలో 'జులై మోనార్కీ' (1831-1848)గా అభివర్ణింపబడిన బూర్జువా సమాజాన్ని, దాని అభిలాషలు, కోర్కెలు పెరుగుదల తో పాటు అసాధారణ ప్రజ్ఞతో ప్రతిబింబిస్తుంది. 'లా' చదవటానికి యువకుడైన రాస్తిన్యాక్ పారిస్‌కువచ్చి మధ్యతరగతి బోర్డింగ్‌హవుసులో మకాంపెట్టాడు. అక్కడుండు స్త్రీ పురుషులు ఆ సమాజానికి అద్దం పట్టేవాళ్ళు. రాస్తిన్యాక్ త్వరలోనే పారిస్ జీవితపు ఊబిలో కూరుకుపోతాడు. అలాంటి ఊబి అంటే, సాధారణంగా బాల్జాక్ నవలల్లో అమిత దురాశ, కుతంత్రాలు, ఉన్నత సమాజం అధిరోహించాలనే కోర్కెలతో ప్రేరితమవటమనే అర్థం. రాస్తిన్యాక్ ఈ సవాలును స్వీకరిస్తాడు, మహోత్సాహంతో శక్తితో పందెంలో పాల్గొంటాడు. అయితే, ఇందులో వున్న మరే పాత్రలూ సాధువులు కావు, ముసలి గోరియోని తను అమితంగా ప్రేమించిన ఇద్దరు కూతుళ్ళు వాడుకుని వదిలివెయ్యటం, ఆ కారణాన అతని మనోవ్యధ కొంత మేరకు షేక్స్‌పియర్ 'కింగ్ లియర్' విషాదాన్ని పోలివున్నా, అదే అతను వయసులోవున్నప్పుడు, ఉద్ధృతమైన విప్లవ కాలంలో (1790-93) చక్కటి అవకాశవాదిగా, విప్లవ సంఘంలో చేరి, దిగుమతి లైసెన్స్ సంపాదించి, యుక్రైన్‌నుంచి చవకగోధుముల్ని దిగుమతి చేసుకుని విపరీతమైన లాభాన్ని ఆర్జించి, ఆ ధనాన్ని క్షేమంగా బయటి పెట్టేవరకూ దాచి వుంచడం అతనెవరికీ తీసిపోనివాడనే మనకు తెలుస్తుంది. అయితే నవల్లో మహాదుర్మార్గుడూ, వంచకుడూ వాత్రిన్. అతని అసలు నేరు జాకస్ కాలిన్ తప్పించుకు పారిపోయివచ్చిననేరస్థుడు. విగ్‌పెట్టుకుంటాడు. అదే బోర్డింగ్‌హవుసులో వుంటూ ఆదర్శవాదిగా నటిస్తూంటాడు. అప్పుడతనికి మహాదా కాంక్ష వున్న రాస్తిన్యాక్ కన్పిస్తాడు. తండ్రి వారసురాలు కాదని వదిలేసిన లక్షధికారి కూతురు తెలిషర్ కుమారిని ప్రేమించమని అతనికి సలహా ఇస్తాడు వాత్రిక్. ఆ లక్షాధికారికి ఒక్కడే కొడుకుఅతనే ఆ ఆస్తికి వారసుడు, ఈ ఏకైక వారసుణ్ణి ద్వంద్వయుద్ధంలో చంపటానికి ప్రణాళిక వేస్తాడు. అతనలా డ్యూయల్‌లో చనిపోగానే చట్టబద్ధంగానే తెలిషర్ కుమారికి తండ్రి ఆస్తి మొత్తం లభిస్తుంది. రాస్తిన్యాక్ కు కట్నంగా ఓమిలియన్ ఫ్రాంకులు లభిస్తాయి. అందులో ఇరవై శాతం కమీషను పొందిన వాత్రిక్ అమెరికాలో స్థిరపడ్డాడు, 200 మంది నీగ్రోబానిసల్ని కొని, మిగతా డబ్బుతో పొలాన్ని కొని పొగాకు పంటలు పండిస్తూ పదేళ్ళలో అమెరికాలో గౌరవనీయుడైన పౌరుడై, నాలుగు మిలియన్ ఫ్రాంకుల ధనికుడవుతాడు. అయితే ఆ లక్షాధికారి కొడుకు చనిపోయినా వాత్రిక్ కలలు పండే అవకాశం లేదు. పారిస్ పోలీస్ విభాగానికిచెందిన తెలివైన డిటెక్టివ్ వాత్రిక్ ఆచూకీ కనుకొనటంలో సఫలమై అతడిని బంధించటంలో సఫలమవుతాడు.

ఈ రేఖా మాత్ర కథా వివరణే మనకు చెప్తుంది - ఎంతలోతుగా బాల్జాక్ ఆనాటి ఆర్థిక వ్యవస్థలోని అంతరిక లొసుగులను అధ్యయనం చేశాడో. ఎలా డబ్బు చేతులుమారటంలో వున్న

వాస్తవాలను పసిగట్టిగలిగాడో. ఇలాంటివి డికెన్స్, జోలా లాంటి రచయితల దృష్టిలోకెప్పుడూ రాలేదు. మరి మార్క్స్, ఏంజెల్స్ లాంటి వాళ్ళు ఆయన్ని అభిమానించారంటే అందులో ఆశ్చర్యమేముంది.

బాల్జాక్ రాసిన ఇంకో నవల La Pean de chagrin (1831). దీన్ని ఇంగ్లీషులోకి నాలుగుసార్లు నాలుగుపేర్లతో - Luck and Leather, The magic skin,The shagreeh skin,The wild-Ass's skin అనువదించారు. బాల్జాక్ నవలల్లో మళ్ళీ మళ్ళీ సినిమాగా తీసిన నవల ఇది. ఆ మంత్రశక్తి కలిగిన చర్మం ధరించిన వ్యక్తి కోర్కెలన్నిటిని అది తీరుస్తుంది. అయితే, ప్రతి వాంఛాపరితృప్తితోనూ అది కొద్దిగా కుదించుకు పోతూవుంటుంది. అలాగే అది ధరించిన వ్యక్తి జీవితం కూడా కుదించుకు పోతూ వుంటుంది. అసంకల్పిత వాంఛాపరితృప్తి కూడా అలాంటి ఫలితాన్నే ఇస్తుంది. ఆ విషయాన్ని గురించి సంస్కృతంలో ఆ చర్మంపై స్పష్టంగా రాసివుంది.

ఈ నవలలో నాయకుడైన రాఫేల్ కూడా రాస్తిన్యాక్ లాగానే చదువుకోటానికి పారిస్ నగరానికి వస్తాడు. మిరుమిట్లు గొల్పే ఉన్నత సమాజం వైపు చూసి తనూ ఆ సమాజంలో భాగమవాలను కుంటాడు. జూదశాలల్లో తన అదృష్టాన్ని పరీక్షించుకో ప్రయత్నిస్తాడు. చివరికి విఫలమనోరథుడై సియన్ నదిలో దూకి ఆత్మహత్య చేసుకోవాలనుకుంటాడు. అప్పు డత నోపురాతన వస్తు సంచాయకుడిని కలవటం జరుగుతుంది. అతను రాఫేల్‌కు ఆ చర్మాన్ని ఇస్తూ '' ఇది నాకిచ్చిన బ్రాహ్మణుడొకాయనచెప్పాడు ఇది ధరించిన వ్యక్తికీ విధికీ మధ్య ఓ రహస్యపూర్ణమైన ఒప్పందం జరుగుతుందని'' అన్నారు. అలా భారతదేశం నుండి వచ్చిన ఆ చర్మం మనుగడ కే సవాలు గా పరిణమించింది. రాఫేల్ ఆ చర్మం సహాయంతో మహాధనవంతుడై పోతాడు. అప్పుడర్థమవుతుంది అతనికి తాను ఎలాంటి ప్రమాదకరమైన పరిస్థితిలో వున్నాడో ఎలాగైనా బతకాలనే పోరాటం అతనిలో ప్రారంభమవుతుంది. అయితే ప్రయోజనమేం లేదు. ఎందు కంటే మనస్సులో కార్యకలాపమంతా ఏదో ఒక కోరికకు సంబంధించిందే కనుక అతని ప్రయత్నం వ్యర్థమవుతుంది. రాఫేల్‌క విషాదాంతమరణం మహాశూన్యం నిరామయమైన మానసిక స్థితిని కోరుకోవటం ఎంత అసాధ్యమో, అది ఎలా మానవాను భవానికి అతీతమో వెల్లడి చేస్తుంది. ఈ కథలో రచయితే ఏ నీతినీ చెప్పడు. వీటిని చెప్పేవారు సగటు రచయితే. షేక్స్పియర్ సిక్స్ కమాండ్‌మెంట్ (నువ్వుచంపరాదు)ను గుర్తుకు చేయటానికి Mac beth నాటకం రాయలేదు. అలాగే బాల్జాక్ కూడా మంచి మంచి కోర్కెలే కోరుకోవాలనో, దానగుణసంపన్నులవవాలనో చెప్పలేదు. అలా చెప్పటం అర్థరహితం. ఎందుకంటే చెడుకోరికా, మంచికోరికా అనేవేం లేవు. వాటి నైతిక దృష్టి ఎలావున్నా అన్ని కోరికలూ కూడా ఫలించటానికి ఇంకోటి అవసరం. అది ఆత్మలోకాక బాహ్యజగత్తులో ఫలిస్తాయి. డాక్టర్ ఫాస్టస్ లాగానే రాఫేల్ కూడా తను మహత్వాకాంక్ష కారణంగానే మరణిస్తాడు.

పాత్రల పునఃప్రయోగం: 1834లో బాల్జాక్‌కు ఒక నవలలో వాడిన పాత్రలను మళ్ళీ ఇంకో నవలలో వాడవచ్చనే ఆలోచన తట్టింది. ఆయన దగ్గర రకరకాల పాత్రల పూల్ ఒకటి వుండేది. అందులో నుండి తనక్కావల్సిన పాత్రను ఎన్నుకుని ప్రయోగించేవాడు. ఒకే పాత్ర మరోనవలలో

ఎందుకు రాకూడదు? ఒక పాత్ర కొన్ని నవలల్లో ముందుకన్పిస్తే అదే పాత్ర మరో నవలలో చివర్లో కన్పించేది. ఆవిధంగా ఆ పాత్రను గురించిన సంపూర్ణమైన అవగాహనను పాఠకుడికి కల్గించే ప్రయత్నం చేశారాయన. ఈ పద్ధతిని ఆయన మొదటిగా లోక నవల Le Pire Goriot లో ప్రయోగించాడు. ఈ నవల్లోని కాలిన్-వాత్రిన్ పాత్ర మరో నవల్లో పారిస్ నగర పోలీస్ డిటెక్టివ్‌ల ఛీఫ్‌గా ప్రత్యక్షమవుతుంది. ఇది కృత్రిమ మైన పద్ధతిగా కన్పించవచ్చు కానీ మానవానుభూతితో నిరంతర పరిచయం కలిగే అవకాశం పాఠకుడికి లభ్యమవుతుంది. ఆ తరవాత వచ్చిన నవలా సైకిల్‌ని సృష్టించిన నవలాకారులకు ఈయన ఆద్యుడయాడు.

బాల్జాక్ స్థానం : సమాజ పునరుద్ధరణ కోసం, మానవానుభవాల సంకలనంకోసం రచనలు చేసిన వ్యక్తి బాల్జాక్. ఈయన నవలల్లో ఆదర్శవాదంలేదు. వాస్తవికతాదృష్టివుంది. నిజానికి చాలా కాలం వరకూ ఆయన్ని నవలలో వాస్తవికతా వాదాన్ని, సహజతావాదాన్ని (naturalism) ప్రతిబింబించిన రచయితగా పరిగణించటం జరిగింది. తన సమాజంలో గుర్తింపు కోసం, విజయంకోసం పోరాటం సలుపుతున్న యువకుల పట్ల అపారమైన సానుభూతి ఆయనకుంది. ఆయనను జీవితంలోని కుళ్ళుమాత్రమే కవ్విస్తుందనీ, ధనికవర్గాన్ని అర్థం చేసుకోటంలో ఆయన విఫలమయారనీ, బూర్జువావర్గంలోని సంపూర్ణ జీవితంతో పరిచయమున్నా, వర్కింగ్ క్లాసును పూర్తిగా వదిలేశారనీ, కళాకారులూ విశృంఖల వాదుల జీవితాన్ని సూక్ష్మంగా చర్చించారనీ, రైతాంగం పట్ల సరైన దృక్కోణం ఆయనకు లేదనీ ఎన్నో విమర్శలున్నాయి. ఏమైనా, బాల్జాక్ గొప్ప రచయితగా ప్రపంచమంతా కీర్తింపబడ్డాడు. ఆయన ప్రభావం ఎంతోవుంది రచయితలపైవుంది. మానవుడిపట్ల ఆయనకున్న అవగాహనను ఆయన పాఠకులు మెచ్చుకున్నారు.

సంప్రదాయ క్లాసికల్ నవలా టెక్నిక్‌ను సుప్రతిష్ఠితం చేసిన ఖ్యాతి బాల్జాక్‌కు దక్కుతుంది. సర్వాన్ని గమనించేవ్యక్తి, ఒకసంఘటనతరువాత హేతుబద్ధంగా మరోసంఘటనకి దారితీయటాన్ని కథగా చెప్పటం, నాటకీయమైన సంభాషణ, పొందికైన పాత్రలు బాల్జాక్ సృష్టి, విషయాలను నిశితంగా పరిశీలించగలిగే దృష్టి, మనసులో ముద్రించుకునే అసాధారణమైన జ్ఞాపకశక్తి ఆయనకుండటమేకాదు, సానుభూతితో ఇతరుల మనసుల్లోకి కూడా వెళ్ళి చూడగలిగే ప్రజ్ఞ ఆయనకుంది. కార్యకారణ సంబంధాన్ని, పాత్ర దాని నేపథ్యాన్నివివరించకుండా ఆయన వుండడు. అందుకే ఆయన పాత్రచిత్రీకరణలో అంత ఓర్పు వహిస్తాడు. ఏ ఏ పరిస్థితుల్లో, వాతావరణంలో ఆపాత్ర ప్రభవిస్తుందో- ఇల్లు, ఇంటి నిర్మాణం, ఫర్నిచర్, గుడ్డలు, వైయక్తిక లక్షణాలు - అన్నీ ఆయన వివరంగా వర్ణిస్తాడు. తన సమకాలీన సమాజాన్ని వున్నదున్నట్లుగా ప్రతిబింబించటమే ఆయన చేసిన పని. అందులో ఆయన కృతకృత్యుడయాడు. అంతేకాదు మానవ చేతన మనుషులు సంఘటనవలపై ఎలా అధిపత్యం వహించగలదో కూడా ఆయన చూపాడు. మానవ మస్తిష్కాలను మథించిన వ్యక్తి ఆయన. అందుకే ఆయన్ని 'నవలా షేక్స్‌పియర్' అన్నా అందులో ఆశ్చర్య మేం లేదు. గొప్ప నవలా కారుడిగా ఆయన చిరస్మరణీయుడు.

* * *

# ౖనం అంటే

- సోమంచి రామం

''జ్ఞానము అనగానేమి? సోదాహరణముగ వివరింపుము..'' ఇదేదో తెలుగు ఎం. ఏ.పరీక్షా పత్రంలోని యిరవై మార్కుల ప్రశ్నలా ఉంది కదూ! అబ్బే!. అదేం కాదు.. మా సూర్యం బాబాయి కొడుకు యీ మధ్య టీచరు ఉద్యోగానికి సెల్క్టయి జాయినయిన ఓ వారం రోజులకి నా దగ్గరకొచ్చాడు. ''అన్నయా! అసలు జ్ఞానము అంటే ఏమిటి? .. జ్ఞానాన్ని గుర్తించడం ఎలాగ?'' అంటూ అడిగే సరికి నాకు మతిపోయినట్టయింది.

అరవైయో పడిలో అడుగిడుతున్న నా లాటి వారికే యింకా అర్ధంకాక, అయోమయంలో కొట్టుమిట్టాడుతుంటే, పట్టుమని పాతికేళ్ళులేవు, యిప్పుడిప్పుడేనూనూగు మీసాలు మొలుస్తున్న లేత కుర్రాడు ఈ కుర్రాడికి జ్ఞానం గురించి తెలుసుకోవాలన్న జ్ఞానోదయం అప్పుడే ఎందుకుకలిగిందీ అని ఖంగారుపడ్డాను. అయినా పసివాళ్ళ ఆతృతని, ఉత్సాహాన్ని అణగద్రొక్కరాదన్న భావంతో ఆ కుర్ర వెధవకి జ్ఞానబోధ - అదే జ్ఞానము గురించి వివరణ యివ్వాలని తలచాను.

''నువ్వు అడిగినంత సూక్ష్మంగా సమాధానంచెప్పాలంటే సాధ్యపడదురా బాబూ!.. రా!.. ఇలా కూర్చో!.. వివరంగా చెప్తాను. సావధానంగా విను!'' అంటూ భావిభారత పౌర నిర్మాణోద్యమ రధసారధి అయిన మావాడ్ని కూర్చోబెట్టి యిలా ప్రారంభించాను. తమరందరూ కూడ శ్రద్ధా భక్తులతో నవధరింపుడు!

జ్ఞానము అనగా ఒక విషయము గూర్చి పరిచయము కలిగియుండుట, సమాచారము తెలిసి యుండుట, మోక్ష విషయమైన బుద్ధి కలిగియుండుట. ఈ జ్ఞానమునందు పలు విధంబులు గలవు. బ్రహ్మజ్ఞానము, కాలజ్ఞానము, లోకజ్ఞానము యిత్యాదులు. జ్ఞానము వెంబడి నీడవలె యుండు నదే బుద్ధి. అందులకే మనము బుద్ధీ, జ్ఞానము అని వ్యవహరింతుము. '' ఆ మాత్రం బుద్ధీ, జ్ఞానం ఉంటే యిలా ఎందుకుంటాడు?'' అంటూ మందలించడం మన మెరుగున్న విషయమే!

దీన్ని బట్టి బుద్ధి, జ్ఞానము ఒకటే యని భ్రమించకు! బుద్ధికి, జ్ఞానానికి తల వెంట్రుక వాసి యంత బేధమే ఉందని తలపోయకు!

విషయస్వభావమును మనసు గ్రహించడమే - జ్ఞానము.

అందలి మంచి చెడులను విభజించడమే - బుద్ధి - అని మనం తేలిగ్గా అర్ధమయేలా చెప్పుకొనవచ్చును. కాని ఈ లౌకిక ప్రపంచంలో రెండింటిని ఒకేలా వాడుతున్నాం!

'' ఏమిటో! ఎప్పుడొస్తుందో ఏమిటో మీకు జ్ఞానం?. ఇంత వయసొచ్చినా కూడ ఆ పసి వెధవతో సమానంగా మీరు కూడ మొండి తనం చేస్తే ఎలా?'' అంటూ పాతికేళ్ళుపైబడిన కొడుకుతో ఘర్షణపడుతున్న అరవై ఏళ్ళ భర్తను, చాల తేలిగ్గా, ఈజీగా, మెత్తమెత్తగా మందలించగల పవరు భార్యకు కాక యింకెవరి కుంటుంది చెప్పునాయనా!

నాశనం లేనిది అక్షరం. ఆద్యంత రహితమైనది, సర్వకాల, సర్వావస్త, సర్వవ్యాపితమైనట్టి సంపూర్ణ ఆదిదైవమే బ్రహ్మము. మార్పులు, నాశనము లేనిది కావుననే దానిని అక్షరమన్నారు - ఇదే బ్రహ్మజ్ఞానము.

శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారు ఏనాడో ప్రవచించిన అక్షర సత్యాలే కాల జ్ఞాన మహిమలు!. కాలం గడుస్తున్న కొద్దీ కాల జ్ఞానమహిమలు మనందరకు అనుభవంలోకి వస్తున్నాయో లేదో ఆలోచించు బాబూ!.

''ఏ కొద్ది పాటి లోకజ్ఞానమన్నా లేకపోతే, ఈ లౌకిక ప్రపంచంలో బ్రతకడం బహుకష్టం'' - అంటాడురా మీనాన్న! అందుకొక్క కథ నుదహరిస్తా!

తొల్లి దినంబుల, మిథిలా నగరం బనెడి గ్రామంబున సుజ్ఞానుండు, అజ్ఞానుండు అను అన్నదమ్ములిర్వురు వాసము చేయుచుండిరి. లోకజ్ఞానము, వాక్చాతుర్యము గల పెద్ద వానిని వంశ పారంపర్యముగ సంక్రమించెడి గ్రామ వ్యవహార నిర్వహణకు, కాయకష్టమే తప్ప కనీస విచక్షణాజ్ఞానమైనను లేని చిన్న వానిని ఉన్న కొంద్రను సాగుచేసి, సేద్యము చేయుటకు ఏర్పాటుచేసి, యిర్వురు సుఖజీవనము గడుపుకొను డనుచు, వారి తండ్రి అవసాన దశలో హితవుపల్కి, కాలము చేసెను. తండ్రి అభీష్టము మేరకు వారిరువురు తమ తమ విధులను యధావిధిగ నిర్వర్తించుచుండిరి.

ఇట్లుండ, ఒక్క దినమున ఆ గ్రామ ప్రముఖులొకరి ముదుసలి తల్లి, వృద్ధాప్యపుభారముతో, మిగుల ముగ్గిన ఫలము నేల రాలిన చందంబున, మృత్యువు వాతబడెను. అత్తఱి, సుజ్ఞానుండు మాతృవిహీనుడైన ఆ గ్రామస్తుని జేరి, ''అయ్యా! దుఃఖించవలదు మరణ మెవ్వారికైనను తప్పింప శక్యముగాదు. తల్లి లేని లోటు తీర్చగలగేది కాదు. అమ్మగారు అదృష్టవంతులు. పుణ్యాత్మురాలు. ధన్యాత్మురాలు. ఆమె మీకొక్కరికే తల్లిగాదు. మన గ్రామ మంతకును తల్లిగనే అందరినాదరించినది''. అంటూ పరామర్శించి ఊరడించెను.

దుష్టసావాసములు మిక్కుటమైన అజ్ఞానుండు దానినంతను పరికించెను. సావాసగాళ్ళ దుర్బోధనలం జేసి అన్నగారి దరిజేరి, ''ఎంతకాల మీ అన్యాయము?. పొలమున, నేలబడి, కాయకష్టము చేసి తిండి గింజలు పండించుట నా వంతా? హాయిగ అలుపు సొలుపు లెరుగకుండ అరుగుపైన కూర్చుండి కబురు లాడుట నీ వంతా? ఇటుపై యిట్లు సాగుటకు నేనంగీకరింపను. ఆస్తి పంపకములు గావించిన, స్వేచ్ఛగ నాబ్రతుకు నేను బ్రతకగలను.'' అని తన ఆక్రోశమును వెల్లడించెను.

అనుభవజ్ఞుడైన అన్న, పరిస్థితి నాకళింపు చేసికొని, ''సోదరా! ఇంత చిన్న విషయమునకే ఆస్తి పంపకము లెందులకు?. అయిననూ, కలిసి ఉంటేనే బలముగుంటాము. చీలిపోతే కూలిపోతాము. కావున, నీ కంత కష్టముగ యున్నచో, యికపై నీవే అరుగుపై కూర్చొని గ్రామ వ్యవహారములను నడిపించుము. నేనే సేద్యము చేసి ఫలసాయమును యిల్లు జేర్చెదను.'' అని అనునయించెను.

ఆవేశమే తక్క ఆలోచనలేని ఆ అమాయకుడు ఆనందముతో వల్లెయనెను.

కతిపయ దినంబులకు ఆ గ్రామ యువకులందొకనికి, భార్యా వియోగము కలిగెను. ఈ విషయము తెలిసి కొన్న అజ్ఞానుండు ఆ యువకునిజేరి, ''మిత్రమా! ఏడువ కేడువకు!. చావు ఎవరికైనను తప్పదు. నీ భార్య చాల అదృష్టవంతురాలు!. అంతేనా! ఆమె నీకే కాదు ఈ గ్రామస్తులందరకు కూడ భార్యగానే బ్రతికింది.'' అంటూ ఆడంబరముగ పలికెను.

ఆ అప్రాచ్యపు మాటలకు ఆగ్రహావేశపరులైన ఆ యువకుని బంధువులందరు, జేరి అజ్ఞానునకు దేహశుద్ధి చేయగా, చావుదప్పి కన్ను లొట్టపోయినట్లు, పరుగు పరుగున యిల్లు చేరుకొనెను. ఆ సరికే యిల్లు చేరిన సుజ్ఞానుండు జరిగిన విషయము గ్రహించి, తమ్ముని తరపున వారందరికి క్షమాపణ తెలుపుకొనెను.

ఈ కథ వలన, లోకజ్ఞాన మన నెట్టిదో నీకు ఒకింత అర్థమై యుండును!

ఈ నాటి రచయితలలో భాషాజ్ఞాన మన్నది మృగ్యమై పోతోందని వెనుకటి తరం వాళ్ళు వాపోతున్నారు. భాషపట్ల, భాషా భాగాలపట్ల, పద ప్రయోగాలపట్ల కనీస జ్ఞానమన్నా ఉండడం లేదని వాళ్ళు అభిప్రాయపడుచున్నారు. పాపం! వారికేమి తెలుసు?. రేసు గుఱ్ఱము కన్న వేగంగ పరుగెత్తి పోయే కాలంలో, కాలానికి తగ్గట్టు నూతన పద ప్రయోగాలు చేసి పాఠకుల్ని అయోమయంలో పడేయగల సత్తా యీనాటి రచయితలదేనని.

ఇక జ్ఞానం నుంచి విజ్ఞానంలోకి వెడదాం!

చింతింపవలసిన బుద్ధిని జ్ఞానము అంటే - అనుష్ఠించతగిన బుద్ధిని విజ్ఞానము అంటారు. జ్ఞానము క్రమక్రమంగా విజ్ఞానంగ మారాలి! కాని వచ్చిన చిక్కల్లా ఈ రోజుల్లో ''వి'' - బదులు - ''అ'' చోటు చేసికొంటోంది. ఆంధ్రభాషకు మొట్టమొదటి అక్షరం ''అ'' - అయినా దానంత శక్తి వంతమైన అక్షరం మరొకటి ఉండదేమో!. ఏ పదం ముందుకైనా, ''అ'' వచ్చికూర్చుందంటే, సర్వం అపసవ్యమే - వ్యతిరేకమే!

అందుకే న్యాయం - అన్యాయం; సాధ్యం- అసాధ్యం; సౌఖ్యం- అసౌఖ్యం; జ్ఞానం- అజ్ఞానం (క్షమించాలి! ఈ పదం అన్నగారి కంటబడితే యింత అగ్నానమా నీకు అంటూ ఆ గ్రహిస్తారు) గమ్యం- అగమ్యంగా మారిపోతాయి.

ఈ జ్ఞానం గురించి ప్రజాకవి వేమన్న ఎంత సింపుల్ లాంగ్వేజిలో చెప్పాడో ఆలకించరా అబ్బాయ్!

**గాజు కుప్పెలోన కదలక దీపం బ**
**దెట్టులుండు జ్ఞాన మట్టులుండు**
**దెలిసినట్టి వారి దేహంబులందున**
**విశ్వదాభిరామ వినురవేమ!**

అయితే యిదే జ్ఞానం గురించి భగవద్గీతలోని విభూతి యోగంలో శ్రీకృష్ణ పరమాత్మ ఏం ప్రబోధించాడో విను నాయనా?

ఆత్మ, అనాత్మల వివేచనా శక్తే జ్ఞానము.

తమ్ముడూ!- భగవద్గీత ప్రస్తావన యెలాగూ వచ్చింది కావున గీతాసారాన్ని ముచ్చటగ మూడు ముక్కల్లో చెప్పుకుందాం!

వర్క్, వర్షిప్, విజ్‌డమ్ - అనగా కర్మ, భక్తి, జ్ఞానము - ఈ మూడే ముఖ్యం! కర్మచేత భక్తి కలుగుతుంది. భక్తి తోడ జ్ఞానము సిద్ధిస్తుంది. జ్ఞానము వలన మోక్షము ప్రాప్తిస్తుంది.

ఇంతకన్న వివరంగ చెప్తే నీకు ఒంట బట్టదు నాయనా. అంటూ జ్ఞానబోధ సారాంశమంతా వివరించడం పూర్తి చేయగానే-

'' ఈ సోది అంతా నాకెందుకన్నయ్యా!. పాఠ్యబోధనా పథకంలో జ్ఞానము, అవగాహన, అన్వయము, నైపుణ్యము- అంటూ నాలుగు ''కాలమ్స్'' వ్రాయాలి తెలుసా!. ఇదిగో ఈ పాఠానికి టీచింగ్ నోట్స్‌లో జ్ఞానము అన్న ''కాలమ్''లో ఏం వ్రాయాలో ఒక్క ముక్కలో చెప్తేపోలా?'' అన్నాడు ఆ అర్భకుడు!

''మొన్న మనం వచ్చిన బండివాడికి నేషనల్ కాంగ్రెస్ విషయమై రెండు గంటలు లెక్చరిచ్చేసరికి ఆ గాడిదకొడుకు వాళ్ళ ఊరి హెడ్‌కానిస్టేబుల్‌ను కాంగ్రెసు వారు ఎప్పుడు బదిలీ చేస్తారని అడిగాడు.'' అంటూ గిరీశంగారు వాపోయినట్లు, తలపట్టుకొని బట్టతలపై జుట్టు పీక్కోవడం నావంతయింది.

# Leading Light

**Try our quiz on the "Father of the Nation"** ***- Ehtesham Anjum***

## QUESTIONS

(1) who first called Gandhiji "Mahatma'? (2) What was special about the train which carried Gandhiji's ashes from Delhi to Allahabad? (3) In Porbandar there is a 79 feet high temple where 79 deeps (oil lamps) are lit daily. What is its significance? (4) "...Seditious fakir striding half-naked up the steps of the Viceroy's palace...to negotiate and parley on equal terms with the representative of the King Emperor." Who made this statement about Mahatma Gandhi? (5) Which is the only film seen by Mahatma Gandhi? (6) On whose death did Gandhi make the remark: ""A giant among men has fallen"? (7) Who wrote the book, Mahatma Gandhi And His Apostles? (8) How old was Gandhi when he got married? (9) Who said the following: ""Mr Gandhi can sleep because his nation is awake; I have to keep awake because my nation is asleep"? (10) Which ashram set up by Mahatma Gandhi was reduced to ashes during riots in 1985? (11) Mahatma Gandhi edited two journals. One was Harijian. Name the other. (12) Who wrote the book, Gandhi - A Life Revisited? (13) Gandhi called the scheduled castes "Harijans'. What did he call the scheduled tribes? (14) It was as protest against which award that Mahatma Gandhi undertook a fast unto death? (15) What were the last words uttered by Mahatma Gandhi?

**See Answers page No. 372**

# ఫారసీ, ఉర్దూసాహిత్యాల్లో గజల్ స్థానం

– సదాశివ

సుప్రసిద్ధ ఫారసీ కవులు రాజాశ్రితులు. హకీం షినాయీ, అత్తార్, మోలానా రూమీల లాంటి ముగ్గురు నలుగురు సూఫీకవులను మినహాయిస్తే మిగతా కవులందరూ ప్రభువులను అతిశయోక్తులతో ప్రశంసిస్తూ పారితోషికాలందుకున్న వాళ్లే. ప్రశంసాత్మక కవితలను ఖసీదా లంటారు. ఖసీదా రాసే కవులకు కావ్యాలంకారశాస్త్రాల మీద అధికారం వుండాలి. ఆశువుగా ధారాళమైన కవిత చెప్పే సామర్థ్యం వుండాలి. శబ్దం చెప్పినట్లు వినాలి. కవిత పిలిస్తే పలుకాలె.

ఆస్థాన ప్రవేశం లభించటమే అతి దుర్లభం. ఒకసారి ప్రవేశం లభించి ప్రభువుల మనసు కెక్కిరా ఇక ఆకవుల వైభవం చెప్పనలవి కానిది. చెప్పేవాళ్లు చెప్పినా నమ్మా లనిపించదు. కాబట్టి ఆ కాలంలో కవిత చెప్పగలిగే వాళ్లు ఖసీదా రచనకే ప్రయత్నించే వాళ్లు. ఖసీదాలు రచించిన ఫారసీ కవుల్లో అన్వరీ, ఖాఖానీ అనే కవులిద్దరు అగ్రగణ్యులు. అనర్వీ నైతే ఖసీదా రచనకు పైగంబరుగా ప్రస్తుతించినారు. ఖాఖానీ ఖసీదాలు వ్యాఖ్యానసహాయం లేకుండా పండితులకు సైతం కొరుకుడు పడేవి కావు. ఉర్దూ ఖసీదా రచనలో సిద్ధహస్తులైన కవులు సౌదా, జోఖ్, అమీర్‌మీనాయీ, దాగ్ మొదలయినవాళ్లు. బహద్దుర్‌షాజఫర్ ఆస్థానకవి జోక్‌కు 'ఖాఖాని- యె-హింద్' అనే బిరుదుండేది. అంటే, భారత దేశపు ఖాఖానీ, ఆంధ్ర వాల్మీకి అన్నట్టు. జోఖ్‌తో పాటు బహద్దుర్‌షా ఆస్థానంలో మిర్జాగాలిబు కూడ వుండేవాడు. ఆస్థానకవి కాడు. ఆశ్రితుడు మాత్రమే. అతడు రాసిన ఖసీదాలు చాలతక్కువ. అవీ సంప్రదాయాన్ని పాటించటానికి రాసినవే కాని పాండిత్య ప్రకర్షకు రాసినవి కావు. చక్రవర్తి జన్మదినం, ఈదులు, వివాహాది శుభసందర్భాల్లో ఖసీదాలు రాసి సమర్పించటం సంప్రదాయం. పాదుషాలను సందర్శించే ప్రముఖులు తమ తమ స్తోమతకు తగినట్లుబంగారు కాసులు నజర్ చేసేవాళ్లు. కవులయితే ఖసీదా నజర్ చేసేవాళ్లు. ఖసీదాలు రచించే సామర్థ్యం మిర్జాగాలిబుకు లేదని కాదు. ఇష్టం లే దనవచ్చు.

ఇక్కడొక ముచ్చట;

తన పెన్షన్ కోసం కలకత్తా వెళ్ళి కొన్నాళ్లక్కడున్నాడు గాలిబు. అతడున్నన్ని రోజులు ఆ మహానగరాన ప్రతిరాత్రి ఎవరింటనో ముషాయిరా. ఇంకెవరింటనో సారస్వతగోష్ఠి. ఒక సారస్వత గోష్ఠి సందర్భాన ఒక పెద్ద మనిషి 'అక్బర్ చక్రవర్తి ఆస్థాన ప్రవేశం నాడే ఫైజీ మహాకవి ఆశువుగా రెండువందల యాభై పంక్తుల ఖసీదా సమర్పించి ఘనంగా సత్కరించ బడినాడు.' అని చెప్పినాడు. ''అయ్యా! ఆదరించే దాతలుంటే రెండు వందలు కాకున్నా రెండు పదుల పంక్తులు చెప్పగలిగే వాళ్లిప్పుడూ వున్నారు.'' అన్నాడు గాలిబు. ఆ పెద్దమనిషి తన పాన్ బీడాల బట్వాలోంచి ఒక నల్లపోక (చిక్నీదలీ) తీసి గాలిబు చేతిలో వుంచి, ''దీన్ని వర్ణించండి''. అన్నాడు. గాలిబు పదకొండు పంక్తుల కవిత ఆశువుగా వినిపించినాడు. ఆ కవిత ఉర్దూ సాహిత్యంలో ఉత్తమమయింది. పదకొండు పంక్తుల్లో ఇరవయ్యొక్క ఉపమానాలు అన్నీ అందమైనవే. అయితే, అలాటి రచనలు గాలిబుకు ఇష్టమైనవి కావు.

ఇక్కడ ఈ ముచ్చట ఎందుకు చెప్పినానంటే ఖసీదా రచనకు అసమానమైన పాండిత్యం అవసరం. దాన్ని అర్థం చేసుకోవటానికి టీకాతాత్పర్యాలవసరం. అయినా దాని వలన కలిగే ఆనందం అతిస్వల్పం. వినేవాళ్లు అబ్బురపడవచ్చు. ఆనందించలేరు, అందుకే అన్వరీ అంతటివాడు ''కవిత్వం చెప్పటం కంటె వ్యర్థమైన వ్యాసంగం లేదు''. అన్నాడు. కవిత్వమంటే అతని ఉద్దేశం ఖసీదా రచన.షాహనామా రచించిన ఫిర్దౌసీ మస్నవీ రచనకు పైగంబరు. షాహనామా ఫారసీ మస్నవీ ఛందంలో రచించబడిద మహాకావ్యం. మస్నవీ అంటే ద్విపద. నిజానికి ఫారసీ ఉర్దూల్లో రుబాయీ తప్ప కడమ కవితా రీతులన్నీ ద్విపదల సమూహాలే. ఆ ద్విపదలు మాత్రాగణ బద్ధమైనవి. సబ్జెక్టును బట్టి, ఖాఫియాల అమరికను బట్టి ఖసీదా, మస్నవీ. మర్సియా, ఖితా, నజమ్, గజల్ అనే పేర్లు ఏర్పడినవి. మన ప్రబంధాల లాంటి కథా కావ్యం మస్నవీ, వీర రసప్రధానమైతే, యుద్ధాది వర్ణనలు విశేషంగా వుంటే దాన్ని రజ్మియా మస్నవీ అంటారు. ప్రేమ,

**'సినారె' లాంటి ఒక రిద్దరిని మినహాయిస్తే, మనలో చాల మందికి గజళ్ళ స్వరూప స్వభావాల గురించి, వాటి గాయన పద్ధతులగురించి సరైన అవగాహనే లేదని పిస్తుంది. ఆ కారణాన, గత అర్ధశతాబ్దంగా గజళ్ళ గురించి రాస్తున్న సదాశివగారిని, గజళ్ళ మీద ఒక నిర్దిష్ట అవగాహన కుదిరే విధంగా, రాయమని కోరాము. వారు అంగీకరించారు. ఇది మొదలు మాత్రమే. –సంపాదకుడు.**

సంయోగ వియోగాలు, పానగోష్ఠులు, ప్రకృతి వర్ణనలు విశేషంగా వుంటే దాన్ని బజ్మియా మస్నవీ అంటారు. షాహనామా రజ్మియా మస్నవీ. మన మహాభారతంతో దాన్ని పోల్చవచ్చు. మోలానా రూమీ ఆరుదఫ్తరాల మస్నవీ రచించినాడు. ప్రపంచ ప్రసిద్ధమైన ఆ మస్నవీని ''మస్నవీ మోలానా రూమ్'' అంటారు. అది రజ్మియా కాదు. బజ్మియా కాదు, సూఫీవేదాంత ప్రతిపాదక మైన ఉత్కృష్ట రచన. నిజామా గంజవీ ఐదు ప్రణయ ప్రబంధాలు రచించినాడు. అతడు గంజ్ నగర నివాసి కనుక అతన్ని గంజవీ అంటారు. గంజ్ అంటే నిధి అని అర్థం. కనుక అతని ఐదు మస్నవీలను ''పంజ్ గంజ్'' అంటారు. అంటే పంచ నిధులు. ఆ పేరు సార్థక మయింది. ఆ పంచ్‌గంజ్ ఎంతగా ప్రజాదరణ పొందిందంటే తర్వాతి కాలంలో అమీర్‌ఖుస్రూ, ఫైజీల వంటి మహాకవులు గూడా పంచ ప్రబంధాలు రచించే ప్రయత్నం చేసినారు.

ఫారసీ కవితా రీతులను తమ భాషలోకి దిగుమతి చేసుకున్న ఉర్దూ కవులు కూడా మస్నవీలు రచించినారు. పండిట్ దయా శంకర్ నసీమ్ రాసిన ''మస్నవీ గుల్జారెనసీమ్'' (గులేబకావళి కథ), మిర్జాషౌఖ్ రాసిన 'మస్నవీ సహరుల్బయాన్' శ్రేష్ఠమైనవి.

ఫారసీ గజల్లకు షేక్ సాదీ పైగంబరు. కానైతే ఆమహాకవి రచించిన గులిస్తాన్, బూస్తానులు జగత్ప్రసిద్ధమైనవి. గులిస్తాన్ వచన రచన, బూస్తాన్ మస్నవీ లాంటి పద్యరచన అయినా, అతన్ని గజల్ పైగంబరన్నారు. నిజానికి గజల్లు ఎలా వుండాలో ఒరవడి పెట్టిన మహాకవి అతడు. గజల్ కవికి కావలసిన లోకానుభవం, సంవేదనా శీలమైన హృదయం, ప్రేమ గల వాడతడు. అతని కంటె ముందు గజల్లెలేకపోలేదు కాని అవి ఖసీదాల మూసలో తయారైనవే. అతని తర్వాత అమీర్‌ఖుస్రూ, సల్మాన్ సావ్‌జీ, హాఫిజ్ షీరాజీల వంటి మహా కవులు గజల్‌ను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది పరిణతం చేసినారు.

ఖగోళం, జ్యోతిషం, గణితం, భౌతిక, రసాయనిక, వైద్యశాస్త్రాల్లో కూలంకషమైన పాండిత్యంతో ప్రామాణిక గ్రంధాలు రచించిన ఉమర్‌ఖయ్యామ్ ఆటవిడుపుగా అప్పుడప్పుడు రచించిన రుబాయీల కారణంగా ప్రపంచ సాహిత్యంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించినాడు. సూఫీ సర్మద్ రుబాయీలు కూడ సువిఖ్యాత మైనవే. ఉర్దూ రుబాయీ రచనలో అమ్జద్ హైదరాబాదీ, రాఘవేందర్‌రావు జజ్బ్ ఆలంపూరీ, అదమ్ సిద్ధహస్తులు.

దక్కన్ గజల్ కవుల నలావుంచినా, ఉర్దూలో గజల్లు రాసి ఉస్తాదులనిపించు కున్న కవులు ఆదికవి మీర్‌తఖీ మీర్ మొదలుకొని, కాళోజీ రామేశ్వరరావు షాద్ వరంగల్ వరకు వందల సంఖ్యలో వున్నారు కనుక అందరినీ స్మరించటం ఈ వ్యాసంలో సాధ్యం కాదు. సౌదా, ఇన్షా, ఆతిష్, నాసిఖ్, గాలిబు, జౌఖ్, మోమిన్, దాగ్, షాద్ అజీమాబాదీ, అసర్ లఖ్నవీ, ఆర్జూ లఖ్నవీ, సఫీ లఖ్నవీ, ఫిరాఖ్... ఎందరి నని స్మరించను ? రామేశ్వర రావుగారి సోదరులు, ప్రజాకవి కాళోజీ నారాయణ రావుగారూ 'బాగీ' అనే కలం పేరుతో గజల్లు రాస్తున్నారు.

ఉర్దూ సాహిత్యం ఇతర కవితా రీతుల వలన కాక కేవలం గజల్ల వల్లనే ఒక విశిష్ట స్థానాన్ని పొందింది. ఉర్దూ కవిత ప్రతిష్టకు, ప్రజాదరణకు కారణం గజలే. ముషాయిరాలకు మూలం గజలే. సంగీత విభావరుల సారం గజలే. ప్రముఖ గజల్ కవి గణేశ్ బిహారీ తర్జ్ ఒక మాటన్నారు;

దోహే, రుబాయి, నజ్మ్ కభీ ''తర్జ్'' థే మగర్! అస్నాఫె-షాయిరీకా ఖుదా వంద్ హై గజల్.

''దోహాలు, రుబాయీలు, నజములు ఒకప్పుడుండేవి. కాని అన్ని కవితారీతుల ఖుదావంద్ గజలే''. అని భావం.

## అక్టోబర్ 1996 సంచికలో అవసరమైన సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసింది |
|---|---|---|---|
| 334 | 33 | లబ్బమనియా | లచ్చుమనియా |
| 335 | 6 | ఈ నవల | చామాణా ఆరగుంటా అనే నవల |

# అంతర్ముఖత్వం - ఆత్మజ్ఞానం

- అబ్బూరి ఛాయాదేవి

అంతర్ముఖత్వం వేరు, ఆత్మజ్ఞానం వేరు అని జిడ్డు కృష్ణమూర్తి గారు ఎన్నో సార్లు తమ ప్రసంగాల్లోనూ చర్చల్లోనూ స్పష్టం చేశారు.

అంతర్ముఖత్వం, ఆత్మజ్ఞానం సమానార్థకాలు కావు. రెండింటి ప్రయోజనాలూ వేరు, రెండింటి ఫలితాలూ వేరు. అంతర్ముఖత్వంలో ఆత్మ పరిశీలన, ఆత్మ విమర్శ, 'నేను' చేసినది మంచి, 'నేను' చేసినది చెడు అని వేరు చేసి తీర్పు చెప్పడం ఉంటాయి. తప్పొప్పులు చేసే 'నేను' వేరు, న్యాయాన్యాయ విచక్షణ చేసే 'నేను' వేరు అనే విభేదం ఏర్పరచుకుని, మనిషి ఆలోచనలు కొనసాగుతాయి. మనిషిలోని పరస్పర విరుద్ధమైన ఆలోచనల మధ్య సంఘర్షణ జరుగుతుంది. ఇతరులతో సంఘర్షణ అంతర్గత సంఘర్షణకి దారితీస్తుంది. అంతర్ముఖత్వానికి లక్ష్యం ఆత్మపురోభివృద్ధి.

ఉదాహరణకి నాకు ఎవరి మీదో పట్టరాని కోపం వస్తుంది. ఆ పరిస్థితి ప్రభావంలో ఎన్నో అనకూడని మాటలంటాను. ఆ మనిషిని దూషిస్తాను, అవమానిస్తాను. అయితే, ఆ సమయానికి నాకు తృప్తి కలిగినా, తరువాత అసంతృప్తి నన్ను వెంటాడుతుంది. ఆ రాత్రి నిద్ర పట్టదు. నా ప్రవర్తనని నేనే సమీక్షించుకుని, నన్ను నేనే నిందించుకుంటాను. అలా ప్రవర్తించకుండా ఉండాల్సింది, ఇంకెప్పుడూ ఆగ్రహానికి లోనవకూడదు అనుకుంటాను. కాని, మళ్లీ మరో సంఘటనలో మళ్లీ కోపానికి గురి అవుతాను. లేదా, నా ప్రవర్తనని సమర్థించుకుని మరింత అహంకారాన్ని ప్రదర్శిస్తాను. అలాగే, కొన్ని సందర్భాల్లో భయపడకూడదు అనుకుంటూనే భయానికి లోనవుతాను. ఆందోళన మంచిది కాదు అనుకుంటూనే ఆందోళన చెందుతాను. నన్ను నేను ఒక నిర్దిష్ట మార్గంలో పెట్టుకోలేక, నిరాశకీ నిస్పృహకీ లోనవుతాను. లోకం మీద కోపం వస్తుంది. నా మీద నాకే కోపం వస్తుంది. జీవితం మీద అసహ్యం, విరక్తీ కలుగుతాయి.

అంతర్ముఖత్వం, ఆత్మ విమర్శ ఈ విధంగా ఆత్మన్యూనతకీ, నిరాశకీ, నిస్పృహకీ, లేదా, అహంకారానికీ, ఇతరులపై ద్వేషానికీ, దౌర్జన్యానికీ, హింసకీ దారితీసే అవకాశం ఉంటుంది. మన సమస్యలు మరింత సంక్లిష్టమవుతాయి.

అందుచేత, మనం పొందవలసింది ఆత్మజ్ఞానం, ఆత్మచైతన్యం. మనం చేయవలసింది మనల్ని మనం తెలుసుకోవడం. మనకి ఇతర మానవులతో, వస్తువులతో, ఇతర ప్రాణులతో, ప్రకృతితో, భావాలతో గల సంబంధాల ద్వారా మన గురించి మనం తెలుసుకోగలుగుతాం. సంబంధం దర్పణం లాంటిది. మనం ప్రవర్తించే తీరునీ, మన అభిప్రాయాల్నీ, వాటిని పైకి ప్రకటించే విధానాన్నీ, లోపల దాచుకున్న వాటినీ, దాగి ఉన్న వాటినీ మన కోరికల్నీ, అనుభూతుల్నీ, ఆచరణనీ అన్నిటినీ గమనించడం వల్లనే మన గురించి మనకి తెలుస్తుంది. ఈ తెలుసుకోవడం వల్ల అవగాహన కలుగుతుంది. ఆత్మజ్ఞానం కలుగుతుంది. సంఘర్షణ నుంచి స్వేచ్ఛలభిస్తుంది.

మనల్ని మనం ఒక్కసారి తెలుసుకుంటే ఇకముందు జీవిత మంతా ప్రశాంతంగా

సాగుతుందనుకోవడానికి వీలుండదు. ప్రతి దినం, ప్రతి క్షణం మనం కొత్త సమస్యల్ని ఎదుర్కొంటూ ఉంటాం, భౌతికంగాగాని, మానసికంగాగాని, సమస్య ఎదురైనప్పుడు సంఘర్షణకి లోనవుతూ ఉంటాం. అందుచేత తన్నుతాను గమనిస్తూ తెలుసుకోవడం అనేది అనుక్షణం జరగాల్సిన ప్రక్రియ. నిత్య చైతన్యంతో జీవించగలిగినప్పుడే జీవితం అర్థవంతంగా గడుస్తుంది. మన ఆలోచనల్నీ, ఆచరణనీ నిష్పక్షపాతంగా, ఉదాసీనంగా గమనిస్తున్నప్పుడు మన ప్రవర్తనలో, ఆలోచనల్లో పరివర్తన దానంతటదే వస్తుంది. మనం ఫలానా విధంగా మారాలి అనే కోరిక, ఆశయం ఉన్నంత మాత్రాన మార్పురాదు. కాని, నిత్యం మన ఆలోచనల్నీ, ప్రవర్తననీ శ్రద్ధగా గమనిస్తున్నప్పుడు మనలో పరివర్తన కలుగుతుంది. ఈ విధంగా శ్రద్ధగా తన్నుతాను గమనించడాన్నే 'ధ్యానం' అంటారు జిడ్డు కృష్ణమూర్తి గారు. ఏకాగ్రత పేరుతో బలవంతంగా ఆలోచనల్ని అణచిపెట్టడం, తరిమికొట్టడానికి ప్రయత్నించడం కాదు ధ్యానం అంటే. మనసులో మెదులుతున్న ఆలోచనల్ని ఎప్పటికప్పుడు శ్రద్ధగా గమనిస్తూంటే వాటి వేగం, సంఖ్య క్రమంగా తగ్గి ప్రశాంతత దానంతటదే ఏర్పడుతుంది. స్పష్టమైన అవగాహన ఏర్పడుతుంది. వివేకం ఉదయిస్తుంది.

వివేకం అనేది పుస్తకాల వల్లగాని, విస్తృతమైన అనుభవం వల్లగాని, మహానుభావుల బోధనల వల్లగాని కలిగేది కాదు. తన మనసుని తను నిత్యం అవలోకిస్తూ తన్ను తను తెలుసుకోగలిగినప్పుడే వివేకం పొందడానికి అవకాశం ఉంటుంది. వివేకం అంటే పరీక్షల్లో ప్రథమ స్థానంలో ఉత్తీర్ణత పొందడం కాదు, గడుసుతనం కాదు, వాదనలో ఎదుటి వారిని ఓడించగల సామర్థ్యం కాదు, ఎక్కువ ధనం సంపాదించగల శక్తి కాదు. ఎన్ని ఉన్నా వివేకం లేనట్లయితే మనశ్శాంతి ఉండదు. జీవితం సంఘర్షణ రహితంగా ఉండదు. జీవితం అంటే సంఘర్షణే అనుకుంటారు సామాన్యంగా. కానీ జీవితాన్ని సంఘర్షణ లేకుండా చేసుకోవడంలోనే వివేకం ఉంది, శాంతి ఉంది.

మన మనసుకి శాంతి లభించాలంటే ముందుగా మనలో మార్పురావాలి. మన ఆలోచనల్లో, మన ప్రవర్తనలో మార్పురావలిసి ఉంటుంది. అంతేగాని, ప్రపంచం అంతటా శాంతి నెలకొన్నాకే వ్యక్తికి శాంతి లభించడం అసంభవం.

జీవితం నుంచి ప్రతి ఒక్కరూ ఆశించేది విజయం, సుఖం, సంతోషం. తక్కిన వాళ్లకన్న మనం పైకి పోవాలనుకుంటాం. మనం సుఖంగా, సంతోషంగా ఉండే పరిస్థితులు ఏర్పడినా, అంతకన్న సుఖంగా, సంతోషంగా ఉండాలనుకుంటాం. ధనం, అధికారం, కీర్తి ప్రతిష్ఠలూ సంపాదించాలని నిత్యం కృషి చేస్తూ ఉంటాం. మన కృషికి ఎన్నో అవరోధాలు ఏర్పడతాయి. ఎందరో అడ్డువస్తారు. నిత్యం సంఘర్షణకి లోనవుతూ ఉంటాం. అయినా, మన కోరికల్నీ, ఆశల్నీ, ఆకాంక్షల్నీ, మన జీవిత విధానాన్నీ మనం వదులుకోలేం. కాని, మనకి మనశ్శాంతి కావాలనుకుంటాం.

వ్యక్తిగత సమస్యలకీ ప్రపంచసమస్యలకీ అవినాభావ సంబంధం ఉంది. ప్రపంచంలోని కొన్ని దేశాలు తీసుకున్న నిర్ణయాలు మన దేశాన్ని ప్రభావితం చేస్తున్నాయి. మన ప్రభుత్వాలు తీసుకున్న నిర్ణయాలు మనవ్యక్తిగత జీవితాల్ని ప్రభావితం చేస్తున్నాయి. ప్రపంచ ఆర్థిక సమస్యలు మన ఆర్థిక సమస్యలుగా పరిణమిస్తున్నాయి. అలాగే, మనం పిల్లల్ని కంటూ పోతూంటే అది ప్రపంచ

జనాభా సమస్య అవుతోంది. మన ఇంట్లోని చెత్తని వీధిలో పారేస్తే అది వీధిలో కాలుష్యానికీ, చుట్టుపక్కల వారి అనారోగ్యానికీ, దారితీస్తోంది. ఒక ఫ్యాక్టరీలోంచి విడుదలయే వ్యర్థపదార్థాలు వాతావరణ కాలుష్యానికి దారి తీస్తున్నాయి. ఈ విధంగా వ్యక్తిగత ప్రవర్తన సమాజాన్నీ, సామాజిక పరిస్థితులు వ్యక్తినీ ప్రభావితం చేస్తున్నాయి. సముద్రంలోని ఆటుపోట్లు లాగ మనిషి ఆలోచనలు వ్యక్తికీ సమాజానికీ మధ్య పయనిస్తాయి. మనిషిలోపల ఉన్నదే బయటికి వస్తుంది. బయట ఉన్నది మనిషి లోపలికి వస్తుంది. సముద్రంలోని నీరులాగ ఆలోచన అనేది ఒకే ప్రక్రియ. ప్రతివ్యక్తిలోనూ 'నేను' అనే ఆలోచన ఉంటుంది. అది అందరిలోనూ అందరి మధ్యా సంఘర్షణని సృష్టిస్తుంది. అందుచేత, తనకు ఇతరులతో, బాహ్యప్రపంచంతో ఉన్న సంబంధాన్ని అవగాహన చేసుకోవలసి ఉంటుంది. తనలో మార్పువస్తే, ఇతరుల్లో, తన చుట్టూ ఉన్న ప్రపంచంలో మార్పురావడానికి వీలుంటుంది.

పరివర్తన అంటె ఆత్మ పురోభివృద్ధికాదు. 'నేను'కి మరింత ప్రాధాన్యం ఇవ్వడం కాదు. 'నేను' అనే ఆలోచన సృష్టించే సంఘర్షణ నుంచి స్వేచ్ఛ లభించడమే సంపూర్ణ పరివర్తన. అంతర్ముఖత్వం ఆత్మని పటిష్ఠం చేసి మరింత సంఘర్షణని సృష్టిస్తుంది. ఆత్మజ్ఞానం అవగాహనని కలిగిస్తుంది. 'నేను' అనే సంకుచిత భావం నుంచీ, అది సృష్టించే సంఘర్షణ నుంచీ విముక్తి కలిగిస్తుంది. ఆత్మజ్ఞానాన్ని బోధించే గురువు వేరే ఎవరూ లేరు, ఎవరికి వారే గురువు అన్నారు జిడ్డు కృష్ణమూర్తి గారు.

## ANSWERS

1. Rabindranath Tagore.
2. It had no first class coaches to show respect to the departed leader who never travelled first class.
3. For the 79 years of Mahatma Gandhi's life.
4. Winston Churchill.
5. Prakash Pictures' Ram Rajya directed by Vijay Bhatt.
6. Bal Gangadhar Tilak.
7. Ved Mehta.
8. 13 years.
9. Mohammed Ali Jinnah.
10. Phoenix Ashram. It is located in Durban in South Africa.
11. Young India
12. Krishna Kripalani.
13. Girijans.
14. The so-called Comunal Award given by Ramsay Mac Donald.
15. "Hai Ram".



Daguerrotype of Balzac by an unknown Photographer, May 1842

